అలెక్సేయ్ తొల్‌స్తోయ్

# బంగారు తాళం

అనే

## బురతీనో సాహసకృత్యాలు



అలెక్సేయ్
తొల్‌స్తోయ్

# బంగారు తాళం

అనే

## బురతీనొ సాహసకృత్యాలు



చిత్రాలు: ఎ. కోషికిన్
అనువాదం: ఆర్వియార్





**А. Толстой**

ЗОЛОТОЙ КЛЮЧИК ИЛИ ПРИКЛЮЧЕНИЯ БУРАТИНО

*На языке телугу*

**A. Tolstoy**

THE LITTLE GOLDEN KEY OR
THE ADVENTURES OF BURATINO

*In Telugu*



సోవియట్ యూనియన్‌లో ముద్రించబడింది

ISBN 5—05—003168—0

అంకితం ల్యూద్మిలా ఇల్యీనిచ్నా తోల్‌స్తాయాకి

## ముందుమాట

నేను చిన్న పిల్లాడిగా వున్నప్పుడు — యెప్పుడో, చాలా చాలా కాలంకితం — నా దగ్గర ''పినోచ్చియో లేదా చిన్న కొయ్య బొమ్మ'' అనే పుస్తకం వుండేది. (ఇటాలియన్ భాషలో కొయ్య బొమ్మకి బురతీనొ అంటారు.)

బురతీనొ సాహస కృత్యాల గురించి నేను నా స్నేహితులకి, మగపిల్లలకీ ఆడపిల్లలకీ, చెబుతూ వుండేవాణ్ణి. కాని ఆ పుస్తకం పోయింది. అంచేత ఆ పుస్తకంలో లేని రకరకాల సాహస కృత్యాలు చేర్చి కథని మార్చిమార్చి చెప్పేవాణ్ణి.

బాలలూ, యిప్పుడు యెన్నో యేళ్లు గడిచేయి. నా జ్ఞాపకాలు బురతీనొమీదకి మళ్లుతున్నాయి. అంచేత ఆ చిన్న కొయ్య బొమ్మ అతి సాహస కృత్యాల గురించి మీకు చెప్పాలని తీర్మానించుకున్నాను.

ఎ. తోల్‌స్తోయ్

# వడ్రంగం పనిచేసే జుసెప్పెకి
# మనిషి గొంతుకతో మాట్లాడే దుంగ తగలడం

చాలా, చాలా కాలం కిందట మధ్యధరా సముద్ర తీరంలోని వో చిన్న వూళ్లో వో ముసలి వడ్రంగి వుండేవాడు. అతని పేరు జుసెప్పె. అతనికి "ఎర్ర ముక్కు" అనే యెగతాళి పేరు వుండేది.

ఓ రోజున అతనికి వో దుంగ తగిలింది. పెద్ద విశేషం యేమీ లేదు, మామూలుగా వుండే దుంగే అది. శీతాకాలంలో చలిమంట వేసుకునే మామూలు దుంగలాంటిదే అది.

"కొయ్య బాగానే వున్నట్టుంది. యే బల్లకేనా కోళ్లు చెయ్యొచ్చు దీంతో" అనుకున్నాడు జుసెప్పె.

కళ్లజోడు పెట్టుకున్నాడు. ఆ కళ్లజోడుకి పెద్ద దారం కట్టేడు. అదీ ముసలిదే. దుంగని చేత్తో పట్టుకుని తిప్పి చేతిగొడ్డలితో కోత మొదలుపెట్టేడు. అతనింకా కోత మొదలుపెట్టేడో లేదో యెవరిదో చిన్న గొంతుక కీచుమని అరవడం వినిపించింది.

"హేయ్! హేయ్! జాగ్రత్త! జాగ్రత్తుస్మా!" అంది.

జుసెప్పె కళ్లజోడుని ముక్కు చివరకంటా లాక్కుని కార్ఖానా చుట్టూతా చూశేడు. యెవళ్లూ కనిపించలేదు.

బెంచీ కింద వెతికేడు. యెవళ్లూ కనిపించలేదు.

కొయ్య రద్దు యెత్తిన బుట్ట చూశేడు. యెవళ్లూ కనిపించలేదు.

గుమ్మం బయటికి తల పెట్టి చూశేడు. వీధిలోనూ యెవళ్లూ కనిపించలేదు.

"నాకేం భ్రమ కలగలేదు కదా? యెవళ్లా మాట్లాడిన వాళ్లు?" అనుకున్నాడు జుసెప్పె.

మళ్లీ చేతిగొడ్డలి అందుకుని దుంగని మోదేడో లేదో...

''అబ్బ! దెబ్బ తగుల్తోంది! చెప్తే వినిపించడం లేదూ?'' అని చిన్న గొంతుక అరిచింది.

యీ సారి జుసెప్పెకి నిజంగా భయం వేసింది. అతని కళ్లజోడుకి కూడా చెమట్లు పట్టేయి. అతను గది అంతా వెతికేడు. చలిమంట వేసుకునే పొయ్యి కూడా వెతికేడు. పొయ్యి లోపల చుట్టూతా చూశేడు. పొగగొట్టం వెతికేడు.

''అబ్బే! యెవళ్ళూ లేందే!''

''నేను నాకు పడని దాన్ని దేన్నేనా తాగానేమో! నా చెవులు హోరెత్తుతున్నాయేమో'' అనుకున్నాడు.



కాని వొట్టిది. తనకి పడని దాన్ని దేన్నీ అతను ఆ పూట తాగలేదు. జుసెప్పె కొంచెం స్థిమిత పడి చిత్రిక అందుకున్నాడు. సుత్తి తీసుకుని అలుగుని సరి సమానంగా వుండేటట్టు కొట్టేడు. దుంగని బెంచీమీద పెట్టేడు. వొక్కసారి చిత్రికని అలా తోశాడో లేదో...

''హేయ్! హేయ్!'' అని మళ్లీ గొంతుక మూలుగుతూ వినిపించింది. ''హేయ్! యెందుకలా నొప్పి పుట్టేటట్టు చేస్తావ్?'' అని వినిపించింది.

జుసెప్పె చిత్రికని కింద పారేసి వెనక్కి గెంతేడు. ఆ గెంతుకి నేలమీద చతికిల పడ్డాడు. ఆ చిన్ని గొంతుక దుంగలోనుంచే వస్తోందని అతనికి అర్థమైంది.

## జుసెప్పె మాట్లాడే దుంగని తన మిత్రుడు కార్లోకి కానుకగా యివ్వడం

సరిగ్గా ఆ సమయంలో జుసెప్పె మిత్రుడు కార్లో వచ్చేడు. అతను బారెల్ ఆర్గన్ అనే సంగీత వాయిద్యాన్ని వాయించేవాడు. కార్లో వొకప్పుడు వెడల్పాటి అంచులు వున్న టోపీ పెట్టుకుని బారెల్ ఆర్గన్ వాయిస్తూ వూరూరా తిరిగి తిండికి సంపాదించుకునేవాడు. కాని అతను యిప్పుడు ముసలాడై పోయేడు. బీదరికం పోలేదు. బారెల్ ఆర్గన్ యెప్పుడో విరిగిపోయింది.

"బాగున్నావా?" అని లోపలికి వస్తూ జుసెప్పెని పలకరించేడు. "యేమిటలా నేలమీద చతికిలబడ్డావ్?" అని అడిగేడు.

"ఏహె! స్క్రూ వోటి పోయింది! ఉఫ్!" అన్నాడు జుసెప్పె. "అబ్బ! దీని దుంప తెగ!" అని వోరగా దుంగకేసి చూశేడు. "యేమిటి సంగతి? యెలా వున్నావ్?" అని కార్లోని అడిగేడు.

"యేం చెప్పమంటావ్? యే పూటకాపూట యెలా గడుస్తుందా అనే బెంగ. దినదిన గండం నూరేళ్లు ఆయుష్షు! నువ్వేదన్నా సలహా యిస్తావేమోనని —"



"అంతకంటే సులభమైంది వుందా!" అని జుసెప్పె హుషారుగా అని, 'యీ దరిద్రపు గొట్టు దుంగ పీడా విరగడ చేసుకుంటా' అని మనసులో అనుకున్నాడు. "సలహాకంటే తెలికైన పని వుందటయ్యా? యిదిగో యిక్కడున్న యీ దుంగని చూశేవా? దాన్ని తీసుకో, కార్లో. యింటికి తీసుకు పో!" అన్నాడు.

"యేడిసినట్టే వుంది!" అని కార్లో నిచారంగా అన్నాడు. "దీంతో నేనేం చేసుకోను? వొకవేళ యింటికి తీసుకు వెళ్లానయ్యా, నా లిక్కి గదిలో చలిమంట వేసుకునే పొయ్యి కూడా లేదు కదా!" అన్నాడు కార్లో.

"యేం చెయ్యాలో నే చెప్తా! కార్లో! వో చాకు తీసుకుని యీ దుంగతో బొమ్మ తయారు చెయ్యి. దానికి నానా రకాల వింతలూ నేర్పు. పాటలు పాడ్డం నేర్పు, ఆటలు ఆడడం నేర్పు. అప్పుడు వూరు తిప్పు. చాలు తిండికి సరిపడా సంపాదించుకుంటావు, కాస్తంత మందుకి కూడా సంపాదించుకుంటావు."

"భలే వాడివే ఎఱ్ఱ ముక్కూ! ఫర్లేదు, వూహ బాగానే వుంది" అని ఆ దుంగ వున్న చోటునుంచి హుషారుగా చిన్న గొంతుక గీమంది.

జుసెప్పెకి మళ్లీ వొణుకు పుట్టేసింది. కార్లో ఆశ్చర్యపోయి చుట్టూతా చూసేడంతే, యీ మాటలు యెవరు అన్నారా అని!

"సరే! నీ మాట కొట్టి పారెయ్యను, జుసెప్పె! యేదీ ఆ దుంగని యిలా యియ్యి!"

జుసెప్పె దుంగని అంది పుచ్చుకుని తన మిత్రుడి చేతిలో పెట్టేశాడు. అతను యెడ్డిగా అలా పెట్టేడో లేకపోతే దుంగే అలా చేసిందో కాని అది యెగిరి గెంతి కార్లో తలమీద వొక్క దెబ్బ మోదింది.

"అబ్బ! యిదా నువ్విచ్చే బహుమతి!" అని కార్లో కోపంగా అన్నాడు.

"అయ్యొయ్యో! నేను కాదయ్యా బాబూ!"

"అంటే నాకు తిమ్మిరెక్కి నేనే మోదుకున్నా నంటావా?"

"అది కాదయ్యా మొగడా! దుంగ మోది వుంటుంది."

"ఛవ్! నువ్వే కొట్టి!"

"వొట్టు! నే కాదు."

"ఎఱ్ఱ ముక్కూ! నువ్వు తాగుబోతువని నాకు తెలుసు. కాని నువ్వు అబద్ధాల కోరువని యిప్పుడు తెలిసింది" అన్నాడు కార్లో.

"యేయ్! యెన్ని గుండెలు నీకు అలా మాట్లాడ్డానికి! చూసుకో యేం చేస్తానో!" అని జుసెప్పె అరిచేడు.

"నువ్వూ చూసుకో, యేం చేస్తానో! ముక్కు పిండేస్తాను."

ముసలాళ్లిద్దరూ వొకళ్లమీద వొకళ్లు బుసకొట్టి కలబడబోయేరు. కార్లో జుసెప్పె ముక్కు పట్టుకున్నాడు. జుసెప్పె కార్లో చెవులమీద పడుతూ వున్న నెరిసిన వెంట్రుకల్ని పట్టుకున్నాడు.

యిద్దరూ వూపు కొద్దీ వొకళ్లడొక్కల్లో వొకళ్లు కొట్టుకున్నారు. ఆ యిద్దరూ అలా కొట్లాడు కుంటూ వుండగా బెంచీ దగ్గర్నుంచి వో చిన్న గొంతుక గీమంటూ అరిచింది.

"వూఁ! వూఁ! కానీ! గట్టిగా వాయించు!" అందా గొంతుక.

ఆఖరికి ముసలాళ్లిద్దరూ అలిసిపోయేరు. ఆయాసం వొచ్చేసింది.

"యెందుకొచ్చింది! రాజీ అయిపోదాం" అన్నాడు జుసెప్పె.

"అలాగే! కానీ!" అన్నాడు కార్లో.

దాంతో యిద్దరూ వొకళ్లనొకళ్లు కాగలించుకున్నారు. కార్లో దుంగని చంకకింద పెట్టుకుని యింటికి వెళ్లిపోయేడు.

# కార్లో కొయ్య బొమ్మని చేసి
# బురతీనొ అనే పేరు పెట్టడం

కార్లో వో లిక్కి గదిలో వుండేవాడు. అది మేడ మెట్ల కింద వుండేది. అక్కడ గుమ్మానికి యెదురుగా గోడలో, చక్కటి నెగడు పొయ్యి వుండేది.

కాని పాపం ఆ చక్కని నెగడు పొయ్యి, ఆ పొయ్యిమీద సలసల మరిగే కుండ నిజమైనవి కావు. పాత కాన్వాస్‌మీద గీసిన బొమ్మలు.

కార్లో గదిలోకి వెళ్ళేడు. అవుకు టేబిల్ పక్కన వున్న వొకేవొక కుర్చీమీద కూలబడ్డాడు. దుంగని పట్టుకుని అటూ యిటూ తిప్పి బొమ్మని చెయ్యడం మొదలుపెట్టేడు.

"దీనికి యేం పేరు పెట్టను?" అని కార్లో తల గోక్కున్నాడు. "ఆఁ! దీనికి బురతీనొ అనే పేరు పెడతాను. నాకు యిది అదృష్టం తెస్తుంది. నాకు ఓ కుటుంబం తెలుసు. తండ్రి బురతీనొ, తల్లి బురతీనొ, పిల్లలూ బురతీనొలే. అందరూ సంతోషంగా చీకూచింతా లేకుండా బతికేరు" అనుకున్నాడు.

మొదటగా దుంగ చివర బొమ్మ జుట్టు చెక్కేడు. తర్వాత నుదురు చెక్కేడు. తర్వాత కళ్ళు చెక్కేడు. అంతే!

హఠాత్తుగా ఆ కళ్ళు తెరుచుకుని అతనికేసి తేరి చూసేయి.

కార్లో భయపడినట్టు పిసరు కూడా ఆచూకీ తెలియ నివ్వలేదు. అందుకు బదులు గోముగా అడిగేడు:

"కొయ్య కళ్ళూ! నాకేసి యెందుకంత వింతగా చూస్తారు?"

కాని బొమ్మ యేమీ అనలేదు. బహుశా యింకా నోరు లేకపోవడం వల్లనో యేమో మరి. కార్లో బుగ్గలు చెక్కేడు. ముక్కు యేర్పాటు చేశాడు. మామూలు సాదా ముక్కు.

అంతట్లోకీ ఆ ముక్కు సాగి పొడుగైంది, సూటిగా బారుగా అయింది. దాంతో కార్లో నోరు వెళ్ళబెట్టేడు. "యింత బారుగా వుంటే బాగోదు" అనుకుని చివర కోసెయ్యడం మొదలుపెట్టేడు. కాని లాభం లేకపోయింది. ముక్కు సుడి తిరిగింది, అటూ యిటూ అందకుండా కదిలింది, ఆఖరికి యెలా వున్నది అలానే వుండిపోయింది అంతే బారుగా, చిత్రంగా, సూటిగా.

కార్లో నోరు చెక్కడం మొదలుపెట్టేడు. పెదాలు చెక్కాడో లేదో నోరు తెరుచుకుని నవ్వింది.

"హ హ హ్హా! హి హి హ్హీ!"

ఉడికిస్తున్నట్టుగా చిన్న యెర్రటి నాలిక యివతలికి వచ్చింది.

కార్లో యీ కుచేష్టల గురించి యిక పట్టించుకోలేదు. తన చిత్రిక పనేమిటో, చెక్కడమేమిటో, మెరుగులు పెట్టడమేమిటో ఆ ధ్యాసలోనే వుండిపోయేడు. బొమ్మకి చుబుకం, మెడ, భుజాలు, వొళ్లు, చేతులూ చేశాడు.

కాలి చిటికిన వేలు పూర్తిచేశాడో లేదో బురతీనో పిడికిలితో కార్లో బట్ట తలమీద వాయించడం మొదలెట్టేడు. గిచ్చడం, గిలిగింతలు పెట్టడం మొదలెట్టేడు.

"యిదిగో!" అని కార్లో కటువుగా హెచ్చరించేడు. "నిన్నింకా తయారు చెయ్యలేదు, తెలుసా? నువ్వప్పుడే కొంటె పనులు మొదలుపెట్టేవు! యిప్పుడే యిలా వుంటే తర్వాత యేమవుతావో, ఏహ్?" అన్నాడు.

అతను బురతీనొకేసి కొరకొర చూశేడు. బురతీనో తండ్రి కార్లోకేసి గుండ్రటి కళ్లతో, చుంచులాగా, చూశేడు.

కార్లో అతనికి చెక్క బద్దలతో పొడుగాటి కాళ్లు చేశాడు. వాటికి పెద్ద పాదాలు చేశాడు. అలా పని పూర్తిచేశాక కార్లో తన కొయ్య మనిషిని నేలమీద నుంచో పెట్టి నడక నేర్పడం మొదలు పెట్టేడు.

బురతీనో అటూ యిటూ వూగిపోయేడు. కాళ్లు సన్నగా చిన్నగా వున్నాయి. వొక అడుగు వెయ్యా, తర్వాత వో గెంతు గెంతా, వో యెగురు యెగరా! అంతే, గుమ్మందాకా వెళ్లిపోయేడు! గుమ్మం దాటేడు, వీధిలోకి వెళ్లిపోయేడు.

"అయ్యో, అయ్యో" అని ఆందోళన పడిపోయి కార్లో బురతీనో వెనక్కాలే వెళ్లేడు. "హేయ్! గడుగ్గాయి! వెనక్కి, యిటు రా!"

కాని యేం లాభం! బురతీనో వీధిలోకి పరిగెత్తేడు, కుందేలు పిల్లలాగా పరిగెత్తేడు. బురతీనో కొయ్య మడమలు రోడ్డు పైన పరిచిన రాళ్లమీద టక్‌టక్‌మని కొట్టుకుంటున్నాయి.

"వాణ్ణి ఆపండి!" అని కార్లో అరిచేడు.

దారమ్మట పోయే వాళ్లు నవ్వేరు. పరిగెడుతూ వున్న బురతీనొకేసి వేళ్లతో చూపించేరు. కూడలిలో వో పెద్ద పోలీసతను నుంచున్నాడు. అతనికి మెలి తిరిగిన మీసాలు వున్నాయి, మూడు అంచుల టోపీ వుంది.

యీ చిన్ని కొయ్య భడవ పరిగెత్తుకు రావడం చూసి ఆ భారీ పోలీసు కాళ్లు యెడంగా పెట్టి నుంచున్నాడు. దాంతో దారికి అడ్డు పడింది. బురతీనో అతని కాళ్ల కిందనుంచి దూరి వెడదామనుకున్నాడు. కాని పోలీసతను బురతీనో ముక్కు పట్టుకుని డాడీ కార్లో తన దగ్గరికి వచ్చేదాకా ఆపేడు.

"అగు నీ పని చెప్తా"నంటూ కార్లో ఆయాస పడుతూ అని బురతీనొని చొక్కా జేబులో పెట్టుకోబోయేడు.

అందరూ చూస్తూ వుండగా, అంత చక్కని రోజున చొక్కా జేబులోనుంచి వూరికే కాళ్లని పైకి పెట్టి వుంచి, గొడవ చెయ్యకుండా గమ్మున వుండడం బురతీనొకి యిష్టం లేదు. లాఘవంగా మెలి తిరిగి కాలిబాటమీద తపామని పడ్డాడు. చచ్చిపోయినట్టు నటించేడు.

''హుఫ్! యిదేదో పెంకెగోలలా వుందే!'' అన్నాడు పోలీసు.

వీధిలో జనం పోగయేరు. బురతీనొ అక్కడ పడి వుండడం చూసి తలలు వూపేరు.

''అయ్యో! బిడ్డా! పాపం! తిండికి మాడిపోయి వుంటాడు'' అని యెవళ్లో సానుభూతి ప్రదర్శించేరు.

''కార్లో యితన్ని చావగొట్టేడు! ముసలి పీనుగ! తనంత పత్తిత్తులాగా నాటకాలాడతాడు! నిజానికి యింత ఘోరమైన మనిషి వుండడు.''



యీ ముక్కలు విన్నాక బుర్ర మీసాల పోలీసతను అన్నెం పున్నెం యెరగని కార్లో చొక్కా బట్టుకున్నాడు, పోలీసు స్టేషన్‌కి బరబర యీడ్చుకుపోయేడు.

కార్లోని బరబర యీడుస్తూ వుంటే అతని బూట్ల కింద దుమ్ము లేచింది.

''యీ కొయ్య బొమ్మని చెక్కి యేం చేటు తెచ్చుకున్నాన్రా నాయనా'' అని కార్లో మూలిగేడు.

వీధిలో జనం వెళ్లి పోయేక బురతీనొ ముక్కు పైకి పెట్టి చుట్టూ చూసి గబగబ యింటికి పోయేడు.

# మాట్లాడే కీచురాయి బురతీనొకి సలహా యివ్వడం



బురతీనొ మేడ మెట్లకింద వున్న చిన్న లిక్కి గదికి పరిగెత్తుకుని వచ్చి కుర్చీ కోళ్ల పక్కన నేలమీద తపాపుని పడిపోయేడు.

"యిక యిప్పుడేం చెయ్యాలి నేను?" అనుకున్నాడు.

బురతీనొ పుట్టి యింకా వొక రోజు కూడా అవలేదు. అంచేత వూహలు తక్కువ — బుల్లివి. పనికి మాలినవి.

అప్పుడు అతనికి వో కంఠం వినిపించింది.

"క్రీ... క్రీ... గ్రీ... గ్రీ..."

బురతీనొ చుట్టూ చూశేడు. గదంతా కలయ జూశేడు.

"హేయ్! యెవరది?"

"నేను... క్రీ... క్రీ..."

అప్పుడు బురతీనొకి బొద్దింకలాంటి జీవి కనిపించింది. కాని దాని తల మిడత తలలాగా వుంది. అది బొమ్మ పొయ్యి పైన గోడమీద కూర్చుంది. మెల్లిగా క్రీ–క్రీ అంటూ వుంది. ఇంద్రధనుస్సు రంగుల్లాంటి కళ్లతో, అద్దాలు పెట్టుకు చూస్తూ వున్నట్టుగా, చూస్తోంది. పొడుగాటి మీసాల్ని అటూ యిటూ ఆడిస్తోంది.

"హేయ్! యెవరు నువ్వు?"

"నేను మాట్లాడే కీచురాయిని. నేనీ గదిలో వంద యేళ్లుగా వుంటున్నాను" అంది ఆ జీవి.

"నేనీ యింటికి యజమానిని. నువ్విక్కడనుంచి వెళ్లిపో!"

"సరే అయితే వెళ్లిపోతా! వంద యేళ్లుగా వున్న చోటు వదిలిపెట్టి వెళ్లిపోవడం బాధగానే వున్నాగానీ వెళ్లిపోతా. కాని వెళ్లే ముందు కాస్త మంచి మాట నీ చెవిని వేసిపోతా, విను" అంది మాట్లాడే కీచురాయి.

"ముసలి కీచురాయి సలహా కావాలండీ నాకు!"

"అయ్యో! బురతీనో! బుంతీనో!" అని కీచురాయి అడ్డం వచ్చింది. "కొంటెతనం పోకు!

కార్లో చెప్పినట్టు విను. రేపు బళ్ళోకెళ్ళాలి నువ్వు, అదే నా సలహా. లేకపోతే ఘోర ప్రమాదాలు, చెడ్డ దుందుడుకు పన్లు వస్తాయి. అప్పుడు దిక్కుమాలి పోతావు'' అని చెప్పింది.

''యేం? యెందుకని?'' అని బురతీనొ అడిగేడు.

''యేం, యెందుకనా!'' అని వెక్కిరించింది మాట్లాడే కీచురాయి. ''అప్పుడు తెలుస్తుంది యెందుకనో'' అంది.

''అబ్బ! వంద యేళ్ల యీడుపు కాళ్ల బొద్దింక! నాక్కావాల్సింది దుందుడుకు పన్లే! రేపు తెల్లవారుతూనే యింట్లోనుంచి పారిపోతా, చూస్తూ వుండు. గోడలవారనే పరిగెడతా. పిట్టల గూళ్ళు పీకి పెడతా. చిన్న పిల్లల్ని యేడిపిస్తా. యింకా బోలెడు పనులు చేస్తా'' అని బురతీనొ అరిచేడు.

''ప్చ్! యేం చేస్తాం! బురతీనో! నీ ఖర్మ అఘోరించు.''

''యెందుకు?'' అని బురతీనొ మళ్లీ అడిగేడు.

''యేమంటే నీకు కొయ్య తలకాయ వుంది, చవటది!''

ఆ మాటకి బురతీనొ కుర్చీమీదకి గెంతేడు. కుర్చీమీదనుంచి టేబిల్‌మీదకి గెంతేడు. వో కొయ్య సుత్తిని అందుకుని మాట్లాడే కీచురాయి తలమీదకి గిరవాటేసాడు.

తెలివైన ముసలి కీచురాయి భారంగా నిట్టూర్చింది. మీసాలు కదిలించింది. పొయ్యి వెనక్కి పాకుకుంటూ పోయింది. గదిలోనుంచి వెళ్లిపోయింది. యిక యెప్పటికీ రాకుండా వెళ్లిపోయింది.



# తన తెలివితక్కువతనంవల్ల బురతీనొ కష్టాలు పొలవడం. డాడీ కార్లో రంగు కాగితాల బట్టలు వేసి పెద్ద బాలశిక్ష కొనిపెట్టడం

మాట్లాడే కీచురాయితో జరిగిన సంఘటన తర్వాత మెట్ల కింద వున్న ఆ లిక్కి గదిలో చాలా విసుగ్గా వుంది. యెంతకీ పొద్దు గడవదే. బురతీనొ బొజ్జలో కూడా మంటగా వుంది.

అతను కళ్లు మూసుకున్నాడు. వెంటనే గిన్నెలో కోడి వేపుడు కనిపించింది.

గబగబ కళ్లు తెరిచేడు. కోడీ గీడీ హుళక్కి! మళ్లీ కళ్లు మూసుకున్నాడు. చక్కటి కిస్‌మిస్ పళ్లు వేసిన సేమ్యా పాయసం కనిపించింది. మళ్లీ కళ్లు తెరిచేడు. పాయసం గీయసం హుళక్కి!

తనకి మా చెడ్డ ఆకలిగా వుందనిపించింది బురతీనొకి.

పొయ్యి దగ్గరికి వెళ్లి సలసల మరిగే కుండలోకంటా ముక్కు పెట్టేడు. కాని బురతీనొ పొడుగాటి ముక్కు సర్‌న లోపలికి పోయింది. మరి మనకి తెలుసుగా, ఆ పొయ్యి, నెగడు, పొగ, కుండ కూడా అచ్చమైనవి కావు. కాన్వాస్‌మీద కార్లో గీసిన బొమ్మ.

బురతీనొ ముక్కు యివతలకి లాక్కున్నాడు. కంతలోనుంచి చూశేడు. కాన్వాస్ వెనక్కాల చిన్న గుమ్మంలాంటిదేదో వున్నట్టుంది, పెద్దది కాదు. కాని అడ్డంగా వో సాలెగూడు వుంది. అంచేత అది యేమిట్మైందీ సరిగా ఆనటం లేదు. తనకి వో రొట్టె ముక్కో, యే పిల్లో తిని వదిలేసిన కోడి బొమికో దొరుకుతుందేమోనని బురతీనొ గది అంతా గాలించేశాడు.

కాని, పాపం, కార్లోకే రాత్రిపూట తిండానికి యేమీ, యేమీ లేదు!

యింతట్లోకీ అతనికి బుట్టలో కనిపించింది: కోడి గుడ్డు కాదు కదా అది! అతను దాన్ని అంది పుచ్చుకున్నాడు, కిటికీ తీనెమీద పెట్టేడు. టప్—టప్ అని ముక్కుతో గుడ్డు గుల్లని కొట్టేడు.

''అమ్మయ్య! నిన్ను మర్చిపోను, కొయ్య బొమ్మా!'' అంటూ ఆ గుడ్డులోనుంచి చిన్న కంఠం గీమంది. పగిలిపోయిన గుడ్డులోనుంచి బుజ్జి కోడి పిల్ల యివతలికి వచ్చింది.

''మరి సెలవ్! అమ్మ కోడి అవతల నా కోసం చాలా సేపటిగా కనిపెట్టుక్కూచుంది'' అంది.

రెప్ప మూసి తెరిచే లోపల అది కిటికీలోనుంచి దూకి పారిపోయింది.

''అయ్యో! నాకు ఆకలిగా వుంది!'' అని బురతీనొ అరిచేడు.

ఆఖరికి పొద్దు వాలింది. గదిలో చీకటి కమ్మింది.

బురతీనొ ఉత్తుత్తి నెగడు దగ్గర వెక్కుతూ కూర్చున్నాడు. అతనికి చెడ్డ ఆకలిగా వుంది.

వున్నట్టుండి మెట్ల అడుగునుంచి పెద్ద బలిసిన తల నేలకిందనుంచి కనిపించింది. వో బూడిద రంగు జంతువు బయటకి వచ్చింది. వాసన చూసి, వొట్టి కాళ్లమీద లేచింది.

అది తాయితీగా రద్దు బుట్టదాకా వెళ్లి అందులో చేరి కోపంగా దాన్ని వాసన చూస్తూ తిరగదోడేస్తూ కలగాపులగం చేసేస్తూ వుంది. అది బురతీనొ పగలగొట్టిన గుడ్డు కోసం వెతుకుతూ వుందేమో.

తర్వాత అది బుట్టలోనుంచి యివతలకి వచ్చి బురతీనొ దగ్గరికి వెళ్లింది. చెరో వేపునా నాలుగేసి మీసాలు వున్న నల్లని మూతిని ముడిచి అతన్ని వాసన చూసింది. కాని దానికి తినదగ్గంత వాసన కొట్ట లేదు బురతీనొ. దాంతో అది సన్నటి పొడుగాటి తోకని యీడ్చుకుంటూ పోయింది.

బురతీనొ వూరుకోగలడా? దాని తోక పట్టుకున్నాడు.

అది దుష్ట వృద్ధ మూషికం. దాని పేరు షుషారు.

భయంతో అది బురతీనొని వెనక్కాలే యీడుస్తూ మెట్ల కింది నీడలాగా పాకిపోబోయింది. వెనక్కి చూసింది. బురతీనొ చిన్న బొమ్మలాగే కద వుంట. చెడ్డ కోపంతో అది విదిలించుకుని అతనిమీదకి పీకపట్టుకుందుకు దూకింది.

బురతీనొకి పై ప్రాణాలు పైనే పోయేయి. దాని తోకని దాని మానాన వదిలేశాడు. కుర్చీమీదకి గెంతేడు. అదీ అతని వెనక్కాలే గెంతింది.

కుర్చీమీదనుంచి అతను కిటికీ తీనెమీదకి గెంతేడు. కాని అదీ అతని వెనకనే గెంతింది.

కిటికీ తీనెమీదనుంచి అతను రకామని యెగురుతూ గది మధ్యలో వున్న బల్లమీదకి దూకేడు. మూషికం కూడా అతని వెనక్కాలే వెళ్లింది, బల్లమీదకి వెళ్లింది. అతని గొంతుక పట్టుకుంది. అతను నుంచున్నాడు. అతన్ని పళ్లతో పట్టుకుని యీడ్చింది. తనూ నేలమీదకి గెంతింది. అతన్ని మెట్ల కింద కలుగులోకి లాగుకుపోవడం మొదలుపెట్టింది.



"డాడీ కార్లో!" అని బురతీనొ కీచుమని అరవగలిగేడంతే.

"ఆః వచ్చె, వచ్చె" అని బిగ్గరగా వో కంఠం జవాబుచెప్పింది.

తలుపు బార్లా తెరుచుకుంది. డాడీ కార్లో లోపలికి వచ్చేడు. అతను తన కొయ్య బూటు వూడ లాగి మూషికంమీదకి విసిరేడు.

షషేర కొయ్య బొమ్మ బురతీనొని వదిలేసి పళ్ళు పటపట కొరికి మాయమైపోయింది.

"చూశావా, కొంటెతనంపోతే జరిగే శాస్తి యిదీ" అని డాడీ కార్లో నేలమీదనుంచి బురతీనొని పైకి యెత్తుతూ అన్నాడు. బురతీనొ వున్నాడో వూడేడో చూద్దామన్చెప్పి డాడీ కార్లో అతన్ని తడిమి చూశాడు. అతన్ని మోకాలిమీద కూర్చోబెట్టేడు. జేబులోనుంచి పో ఉల్లిపాయ తీసి దాన్ని వొలిచాడు.

"వూ, రా తిను."

బురతీనొ ఆకలిగా వున్నాడేమో ఠక్కున ఉల్లిపాయని కొరికి నమిలి తిన్నాడు. పెదాలు చప్పరించేడు. అంతా తిన్నాక డాడీ కార్లో బిరుసు గడ్డంమీద బుగ్గలు రాసుకున్నాడు.

"నేను బుద్ధిగా, తెలివిగా వుండే చిన్న పిల్లాడిలా అవుతాను డాడీ కార్లో. మాట్లాడే కీచురాయి నన్ను బళ్ళోకి వెళ్ళమని చెప్పింది."

"బాగుంది, మంచి మాటే కదా అది! బాబూ!"

"కాని డాడీ కార్లో, నేను బిత్తలగా వున్న వొట్టి కొయ్య బొమ్మని కదా. యిలా బళ్ళోకి వెడితే పిల్లలందరూ నవ్వరూ?"

"అయ్యో తెలివాని! నిజమేన్రోయ్!" అని కార్లో బిరుసుగా వున్న గడ్డాన్ని గోక్కున్నాడు.

అతను దీపం వెలిగించేడు. కత్తెర తీసుకున్నాడు. జిగురు, కాసిని కాగితం ముక్కలు తీసుకున్నాడు. జేగురు రంగు కాగితం



తీసుకుని వో చొక్కా తయారు చేశాడు. ఆకుపచ్చ లాగు తయారు చేశాడు. ఆ రెండింటినీ అతికేడు. వో పాత బూటు తీసుకుని పై తోలు వొలిచి వో జత బూట్లని చేశాడు. వో చిన్న టోపీ తయారు చేశాడు. కుచ్చు వేలాడే కుళ్లాయి అది. దీన్ని పాత మేజోడుతో తయారు చేశాడు. వీటినన్నిట్నీ బురతీనొకి తొడిగేడు.

''యేం బాగా అమిరేయి కదూ?'' అన్నాడు.

''డాడీ కార్లో! పెద్ద బాలశిక్ష లేకుండా బడికి యెలా వెళ్లను?''

''అబ్బ! మరిచానుస్మా!'' అన్నాడు డాడీ కార్లో. మెడ వెనక గోక్కున్నాడు. అప్పుడు తనకి వున్న వొక్క కోటునీ భుజంమీద వేసుకుని బయటికి వెళ్లేడు.

కొంచెం సేపట్లోనే తిరిగి వచ్చేడు. కాని కోటు లేదు. చేతిలో చిన్న పుస్తకం వుంది. ఆ పుస్తకంలో పెద్ద అక్షరాలూ అందమైన బొమ్మలూ వున్నాయి.

''యిదిగో పెద్ద బాలశిక్ష. మరి బుద్ధిగా చదువుకో! శుభం.''

''కాని నీ కోటు యేదీ? డాడీ కార్లో?''

''అమ్మేశాను. పోన్లే దాన్ని గురించి పట్టించుకోకు. లేకపోయినా ఫర్లేదు. నువ్వు బాగా వుంటే అదే పదివేలు!''

బురతీనొ ముక్కుని డాడీ కార్లో దివ్య హస్తాలకి రాశేడు.



''నేను బాగా బాగా చదివేసి పెద్ద వాణ్ణయి నీకు బోలెడు బోలెడు కోట్లు కొనిపెడతాను'' అన్నాడు.

బురతీనొ తను పుట్టిన మొదటి రోజు సాయంత్రమే మాట్లాడే కీచురాయి సలహా యిచ్చినట్టుగా మంచి పిల్లవాడు కావాలని మనసారా కోరుకున్నాడు.

# బురతీనొ పెద్ద బాలశిక్ష అమ్మేసి కీలుబొమ్మలాటకి టికెట్ కొనుక్కోవడం

పొద్దున్నే బురతీనొ పెద్ద బాలశిక్షని సంచీలో పెట్టుకుని యెగురుకుంటూ గెంతుకుంటూ బడికి పరిగెత్తి వెళ్లేడు.

దారిలో అతను దుకాణాల కిటికీలోనుంచి యువతలకి కనిపించేటట్టు పెట్టిన మిఠాయిల కేసిగాని, తేనె రొట్టెల కేసి గాని, అప్పచ్చుల కేసిగాని పుల్లముక్కలకి గుచ్చి కోడిపుంజుల్లా వున్న పీచు మిఠాయిల కేసిగాని చూడలేదు.

గాలి పటాలని యెగరేసుకుంటూ వున్న చిన్న పిల్లల కేసీ చూడలేదు.

బూడిదరంగు చారల పిల్లి బాసిలో వీధిలో అడ్డంగా పోయింది. బురతీనొ దాని తోక పట్టుకుని లాగే వాడే. కాని లాగలేదు.

బడి దగ్గరయే కొద్దీ అతనికి హుషారైన సంగీతం యింకా యింకా యెక్కువ గట్టిగా చెవిన బడుతూ వుంది. మధ్యధరా సముద్రం తీరంనుంచి బహుశా దూరం వుండి వుండదు.

"తూ తూ తూ" పిల్లనగ్రోవి యీల వేసింది.

"లా లా లా" అంది ఫిడేలు.

"ఖంగ్ ఖంగ్ ఖంగ్"మన్నాయి తప్పెట్లు.

"ఢం!" అంది డోలు.

బడికి వెళ్లాలంటే కుడి వేపు తిరగాలి. యీ వాయిద్యాలు యెడం వేపునుంచి వినిపిస్తున్నాయి. బురతీనొ తడబడ్డాడు. అతని కాళ్లు వాటంతాట అవే యీ సంగీతం వినవచ్చే తీరంకేసి లాక్కు వెళ్లాయి.

"తూ తూ తూ..."

"లా లా లా..."

"ఢం!"

"సరే, బడేం పారిపోదు" అనుకున్నాడు బురతీనొ పైకి. "వూరికే వో సారి యిదేమిటో చూసి వెడతాను. తర్వాత బళ్లోకి వెడతా" అనుకున్నాడు.

అతను గబగబ సముద్ర తీరం దగ్గరికి పరిగెత్తి వెళ్లిపోయేడు. అక్కడ గుడారం కనిపించింది. దానికి రంగురంగుల జెండాలు అలంకరించి వున్నాయి. అవి సముద్రం గాలికి రెపరెపలాడుతూ వున్నాయి.

ఆ గుడారం పైన కట్టిన బాల్కనీలో నలుగురు నుంచుని సంగీతం వాయిస్తున్నారు, డాన్సులు చేస్తున్నారు.

కింద వొకావిడ నుంచుంది. ఆవిడ భారీగా వుంది. నవ్వులు వొలక బోసేస్తూ వుంది. టికెట్లు అమ్ముతోంది.

లోపలికి వెళ్లే దారి దగ్గర పెద్ద గుంపు పోగయింది. ఆడపిల్లలు, మగపిల్లలు, సైనికులు, పళ్ల



రసాలు అమ్మేవాళ్లు, చిన్న పిల్లల్ని యెత్తుకున్న దాదులు, అగ్నిమాపకదళం వాళ్లు, తపాలా శాఖ వాళ్లు పోగయేరు. అందరూ అక్కడ అతికించిన పోస్టరుని చదువుతున్నారు.

బురతీనొ వో చిన్న పిల్లాణ్ణి చొక్కా చెయ్యి పట్టుకు గుంజేడు.

"టికెట్ యెంతవుతుందో తెలుసయ్యా?" అని అడిగేడు.

ఆ కుర్రాడు తాయితీగా

"నాలుగర్ధణాలు, కొయ్య బొమ్మా" అని గొణిగేడు.

"నా పర్సు యింటి దగ్గర మర్చిపోయేను. నాలుగర్ధణాలు అప్పిస్తావూ? ఆఁ?"

ఆ కుర్రాడు యెతికుతంగా యీల వేశాడు.

"భలే వాడ్లా వున్నావే!"

"కీలుబొమ్మలాట చూడాలని చెడ్డ యిదిగా వుంది నాకు" అని గుడ్ల నీరు కుక్కుకుంటూ అన్నాడు బురతీనొ. "నా చొక్కా కొనుక్కో నాలుగర్ధణాలకి అమ్మేస్తాను" అన్నాడు.

"యేమిటీ! కాగితం చొక్కాకి నాలుగర్ధణాలా! దయ చెయ్యి, దయ చెయ్యి! చవటాయీ!"

"పోనీ అయితే, యీ చిన్ని టోపీ."

"యీ టోపీయా? చాలు! చాలు! యిదెందుకు పనికొస్తుంది? వెళ్లవయ్యా బాబూ!"

బురతీనొకి మహా కండూతిగా వుంది. యెలాగైనా లోపలికి వెళ్లాలని వుంది.

"నా పెద్ద బాలశిక్ష తీసుకోపోనీ, కొత్తది, నాలుగర్ధణాలు."

"బొమ్మలున్నాయా?"

"అద్భుతమైన బొమ్మలు, పెద్దపెద్ద అక్షరాలు వున్నాయి."

"సరే అయితే, తే" అన్నాడా కుర్రాడు. పెద్ద బాలశిక్షని తీసుకుని యిష్టం లేనట్టుగా నాలుగర్ధణా బిళ్లలు లెక్కపెట్టి యిచ్చేడు.

బురతీనొ అక్కడ నుంచున్న భారీ ఆడమనిషి దగ్గరికి వెళ్లేడు.

"యిదుగో, తోలు బొమ్మలాట యేకైక ప్రదర్శనకి మొదటి వరసలో వో టికెట్ యివ్వండి" అన్నాడు.



# కీలుబొమ్మలు బురతీనొని ప్రదర్శన జరుగుతూవుండగా గుర్తించడం

బురతీనొ మొదటి వరసలో కూర్చున్నాడు. తెర యింకా యెత్తలేదు. దానికేసి సంతోషంగా చూశేడు.

దానిమీద నాట్యం చేసే బొమ్మల చిత్రాలు వున్నాయి. నల్లని ముసుగులు వేసుకున్న చిన్న ఆడపిల్లల చిత్రాలు వున్నాయి. జీబురు గడ్డాల భయంకరమైన మనుషుల చిత్రాలు వున్నాయి. ఆ చిత్రాలకి కోసుగా లేచిన టోపీలు, వాటిమీద నక్షత్రాలు వున్నాయి. సూర్యుడి చిత్రం కూడా వుంది. ముక్కూ కళ్ళూ పెట్టిన చపాతీలాగా వుంది. యింకా అలాంటివి చిత్రమైన కుతూహలం రేకెత్తించే చిత్రాలు వున్నాయి.

మూడు సార్లు గంట మోగింది. తెర లేచింది.

స్టేజికి కుడి వేపునా, యెడం వేపునా దేవదారు పలకల్తో చేసిన చెట్లు బొమ్మలు వున్నాయి. వాటిపైన వో లాంతరు వేలాడుతోంది. అది చంద్రుడి ఆకారంలో వుంది. దాని కాంతి వో అద్దం మీద ప్రతిఫలిస్తోంది. ఆ అద్దంమీద దూదితో చేసిన రెండు హంసలు యీదుతున్నాయి.

వో దేవదారు పలక చెట్టు వెనకనుంచి వో బొమ్మ యివతలికి వచ్చింది. ఆ బొమ్మకి తెల్లని పొడుగాటి చొక్కా, ఆ చొక్కాకి పొడుగాటి చేతులూ వున్నాయి. ఆ బొమ్మ ముఖం అంతా తెల్లని పళ్ల పొడి రాసినట్టు పౌడరు అద్ది వుంది.

ఆ బొమ్మ మహా వినయంగా ప్రేక్షకులకి వొంగి దణ్ణాలు పెట్టింది.

"అందరికీ వందనాలు. నన్ను ప్యెరో అంటారు. యిప్పుడు తమకి 'నీలం జుట్టు చిన్న అమ్మాయి లేదా నెత్తిమీద ముప్పై మూడు చరుపులు' అనే ప్రదర్శనని చూపిస్తాం. నన్ను కర్రతో మోదుతారు, ముఖంమీద చరుస్తారు, బేడీలు వేస్తారు. యిది చాలా హాస్యపూరితంగా వుండే ప్రదర్శన" అని యేడుపు మొహం పెట్టి చెప్పాడు. యింతట్లోకీ మరో బొమ్మ రెండో దేవదారు పలక చెట్టు వెనకనుంచి యివతలికి వచ్చింది.

ఆ బొమ్మ కూడా ప్రేక్షకులకి వినయంగా దణ్ణం పెట్టింది.

"దణ్ణాలండీ! నా పేరు హార్లెక్విన్."

అని ప్యెరోకేసి తిరిగేడు. ఆ బొమ్మ మనిషి ప్యెరోమీదకి వురికి ముఖంమీద రెండు చరుపులు తపాతపా గట్టిగా చరిచేడు. ఆ దెబ్బకి ప్యెరో ముఖంమీద అద్దిన పౌడరు నాలుగు వేపులకీ చెదిరిపోయింది.

"యేం అలా చీదుకుంటూ యేడుస్తున్నావ్, శుంఠా?"

"నాకు బాధగా వుంది, పెళ్లి చేసుకోవా లనుకుంటున్నాను" అన్నాడు ప్యెరో.

''అయితే చేసుకోలేకపోయేవూ?''

''యేదీ, అమ్మాయి పారిపోయింది...''

''హ్హా, హ్హా, హ్హా! భలే చవటవే!'' అని హార్లెక్విన్ పొట్టచెక్కలయ్యేటట్టు నవ్వేడు. అప్పుడు వో కఱ్ఱ తీసుకుని ప్యెరోని చితక మోదేడు.

''మీ అమ్మాయి పేరేంటి?''

''నన్ను కొట్టవు కదా యింక?''

''యేదీ, యిప్పుడేగా బోణీ చేశాను.''

''అయితే విను, ఆమె పేరు మల్వీనా, నీలం జుట్టు చిన్న అమ్మాయి.''

''హ్హా! హ్హా! హ్హా!'' అని హార్లెక్విన్ మళ్లీ పగలబడి నవ్వేడు. ప్యెరో నెత్తిమీద మూడు దెబ్బలు కొట్టేడు. ''అమ్మలారా! అయ్యలారా! వినండి! నీలం రంగు జుట్టు వున్న పిల్లల గురించి మీరెన్నడేనా విన్నారా?'' అన్నాడు.

అప్పుడు ప్రేక్షకులకేసి చూశేడు. మొదటి వరసలో కొయ్య బొమ్మ కనిపించింది. పొడుగాటి ముక్కు, కోసు టోపీ వున్న బొమ్మ. పెద్ద నోటితో పెదాలు చెవులు తాకేటట్టు నవ్వుతూ వుందా బొమ్మ.

''చూశావా? బురతీనో వున్నాడిక్కడ!'' అని హార్లెక్విన్ వేలు పెట్టి చూపిస్తూ అరిచేడు.

దేవదారు పలక చెట్ల వెనకనుంచి కీలుబొమ్మలు గుంపుగా వచ్చేయి. నల్లని ముసుగులున్న చిన్న ఆడపిల్లలు, జీబురు గడ్డం, కోసు టోపీలు వున్న భయంకరమైన మనుషులు, బొత్తాలు కళ్లకి లాగా పెట్టిన బొచ్చు కుక్కలు, దోసకాయ ముక్కులున్న గూనివాళ్లు మూగుకుంటూ వచ్చేరు.

అందరూ స్టేజిమీద పడే కొవ్వొత్తుల దగ్గర కంటా వచ్చి తేరి చూసి గొణుక్కోవడం మొదలు పెట్టారు.

''బురతీనో! అరె, బురతీనోయే! రా, యిలా రా బురతీనో, కోణంగి హాస్యగాడా!''

బురతీనో ముందునుంచి తెర దగ్గరికి, అక్కణ్ణుంచి స్టేజిమీదకి గెంతి వెళ్లేడు.

కీలుబొమ్మలు అతన్ని పట్టుకుని కౌగిలించుకుని ముద్దుపెట్టుకుని గిచ్చేశాయి. అప్పుడు అన్ని బొమ్మలూ ''పిట్ట పోల్కా నాట్యం'' అనే పాట పాడేయి.

ఓ పిట్ట చేసింది పోల్కా నాట్యం
తెల్లవారుతుండగా తోటలోన —
యెడం వేపు ముక్కు
కుడి వేపు తోక —
అదే కదా మరి ''కరబాస్'' పోల్కా!



ప్రేక్షకులు బాగా చలించిపోయేరు. వో దాదికి కన్నీళ్లు కూడా తిరిగేయి.

కాని, వెనక్కాల బెంచీలమీద కూర్చున్న చిన్న కుర్రాళ్లు చిరాకు పడ్డారు, కాలితో నేలమీద తన్నేరు.

"అబ్బ! చాలా కౌగిలింపులు యేడ్పులు! చిన్న పిల్లల్లా యేమిటది? అక్కడ ప్రదర్శన సాగించండి!" అని అరిచేరు. యీ గోలకి లోపల్నుంచి వొకాయన వచ్చేడు. ఆయన్ని చూస్తే జడుసుకుంటారు, కొయ్యబారిపోతారు అలా వున్నాడు.

అతని గడ్డం నేలమీద కంటా జీరాడుతోంది. అది జీబురుగా వుంది. అతని మిడిగుడ్లు ఉబ్బుకు వచ్చేయి, అవి తిరుగుతున్నాయి. అతని నోరు దాకలా వుంది. పళ్లు పటపట కొరుకుతున్నాడు. ఆ నోరు చూస్తే మనిషి కాదు, మొసలేమో అనిపిస్తుంది. అతని చేతిలో యేడు తాళ్ల కమ్చీ వుంది.

అతను కీలుబొమ్మల థియేటర్ యజమాని, కీలు బొమ్మలాటల భట్టు, శ్రీమాన్ కరబాస్ బరబాస్‌గారు.

"అహ్హా! హా! హా! హేయ్! హేయ్!" అని బురతీనొని చూసి గర్జించేడు. "అయితే నువ్వన్న మాట మా భేష్పైన ప్రదర్శనని తగలేసిన వాడివి!" అన్నాడు.

బురతీనొని చొక్కా పట్టుకు లేపి థియేటర్ కొట్టు గదిలోకి బరబర తీసుకుపోయి, వో కొక్కేనికి వేలాడదీశేడు. తర్వాత మళ్లీ తిరిగివచ్చి సరిగా ప్రదర్శన సాగించమని యేడు తాళ్ల కమ్చీ వూపి కీలుబొమ్మల్ని బెదిరించేడు.

మొత్తం యెలాగో వొకలాగ ప్రదర్శన అయింది అనిపించేరు. తెర వాలింది. జనం యెక్కడి వాళ్లక్కడ సర్దుకున్నారు. కీలుబొమ్మలాటల భట్టు శ్రీమాన్ కరబాస్ బరబాస్‌గారు భోజనం చెయ్యడానికి వంటింట్లోకి వెళ్లేడు.

భోజనం చేసేటప్పుడు అడ్డం రాకుండా వుండాలని గడ్డం పైకి మడిచి జేబులోకి దోపుకున్నాడు. పొయ్యి దగ్గర చేరాడు. పొయ్యిమీద వో కుందేలూ, రెండు కోడిపెట్టలూ వేగుతున్నాయి.

వేళ్లతో తాకి యింకా వేపుడు తయారవలేదని అనుకున్నాడు.

పొయ్యిలో కట్టెలు సరిపడగా లేవు. అందుకని మూడు సార్లు చప్పట్లు కొట్టేడు. హార్లెక్విన్, ప్యెరోలు లోపలికి వచ్చేరు.

"యెందుకూ పనికి రాని ఆ బురతీనొగాణ్ణి యిలా పట్టండి. యెండు కొయ్యతో చేశారు వాణ్ణి, యీ పొయ్యిలోకి వాణ్ణి గిరాటు వేస్తాను, వేపుడు తొందరగా తయారవుతుంది" అన్నాడు శ్రీమాన్ కరబాస్ బరబాస్.

అయ్యొయ్యొ పాపం బురతీనొమీద కనికరం చూపించమని హార్లెక్విన్, ప్యెరోలు మోకాళ్లమీద వాలి వేడుకున్నారు.

"యేదీ కమ్చీకోల?" అని కరబాస్ బరబాస్ బుసకొట్టేడు.

దాంతో వాళ్లు వెక్కుతూ కొట్టు గదికి వెళ్లి, బురతీనొని కొక్కెంమీదనుంచి దింపి వంట యింటికి యీడ్చుకువచ్చేరు.



## బురతీనొని కాల్చిపారెయ్యకుండా శ్రీమాన్ కరబాస్ బరబాస్ అతనికి అయిదు బంగారు కాసుల్ని యిచ్చి యింటికి పంపెయ్యడం

బొమ్మలు బురతీనొని యీడ్చుకువచ్చి నెగడు చక్రటం దగ్గర నేలమీద పడేశారు. శ్రీమాన్ కరబాస్ బరబాస్‌గారు నాసికా పుటాల్లోంచి బుసలు కొట్టేస్తున్నాడు. చువ్వతో నెగడులో బొగ్గులు కలదిప్పేస్తున్నాడు.

హఠాత్తుగా అతని ముఖం యెర్రగా కందిపోయింది. అతని ముక్కు, తర్వాత మొత్తం ముఖం ముడతలు పడిపోయేయి. బొగ్గు నుసి ముక్కు పుటాల్లోకి దూరి వుండచ్చు.

"హాచ్... హాచ్... హాచ్చి" అంటూ కళ్లు ముదుచుకుని కరబాస్ బరబాస్ తుమ్మేస్తున్నాడు.

ఆయన యెంత గట్టిగా తుమ్మేస్తున్నాడంటే నెగడులోని బూడిద పైకి లేచింది.

కీలుబొమ్మలాటల భట్టు శ్రీమాన్ కరబాస్ బరబాస్‌గారికి తుమ్ములు వచ్చేయంటే వో పట్టాన ఆగవు. యాభై, వొకోసారి వంద తుమ్ములు వచ్చేస్తాయి.

ఆ దెబ్బకి ఆయన పని అయిపోతుంది. అతని కోపం కూడా పోతుంది.

"యిదిగో ఆయన తుమ్ముల మధ్యలో సందు చూసుకుని మాట కదలెయ్యి" అని ప్యెరో రహస్యంగా బురతీనొ చెవిలో వూదేడు.

"హాచ్... హాచ్..." అంటూ కరబాస్ బరబాస్ నోరు తెరుచుకుని శ్వాస పీల్చి, తల కదుపుతూ కాళ్లు నేలమీద తొక్కుతూ, కదిలిపోతూ, పడపడ తుమ్ముతూనే వున్నాడు.

వంట గదిలో వున్నవన్నీ కదిలిపోతున్నాయి, అద్దాలు టకటకమంటున్నాయి, కొక్కేలమీద వున్న గిన్నెలూ పళ్లేలూ వూగిపోతున్నాయి.

యీ తుమ్ముల మధ్యలో బురతీనొ దీనంగా వేడికోలు చేసుకున్నాడు.

"అయ్యో! అయ్యో! యెవళ్లకీ నామీద జాలి లేదా?"

"ఛవ్! గోల! గోలాని!" అంటూ కరబాస్ బరబాస్ అరిచేడు. "నాకు అడ్డం వస్తున్నావు... హాచ్... హా... చ్చి!"

"మీకు శ్రీరామ రక్ష! అయ్యా!" అని యేడుస్తూ బురతీనొ అన్నాడు.

"ఆ ముక్కన్నావు బాగుంది! వూఁ, చెప్పు మీ అమ్మానాన్నా వున్నారా?... హాచ్..."

"నాకు అమ్మ ఆదినుంచీ లేదు, అయ్యా! అయ్యో! అయ్యో! నేనెంత దురదృష్టవంతుణ్ణి!" అంటూ బురతీనొ యేడుపు లంకించుకున్నాడు. ఆ గొంతుక కీచుగా కరబాస్ బరబాస్

కర్ణభేరుల్ని సూదులతో పొడుస్తున్నట్టుగా వుంది.



అతను కాలితో నేలమీద తన్నేడు.

"ఛప్! అరుపులు ఆపు!... హాచ్... వూఁ, మీ నాన్న వున్నాడా?"

"వున్నాడయ్యా, పాపం."

"నిన్ను కుందేలునీ, రెండు కోడిపెట్టలనీ వేయించుకోవడానికి వాడుకునానని వింటే ఆయన యెలా ముఖం పెడతాడో నేను వూహించుకుంటాలే... హాచ్..."

"పాపం మా నాన్న ఆకలికీ చలికీ యెలాగైనా చనిపోతాడు. ఆయన ముసలితనంలో నేనే ఆయనకి దిక్కు. నామీద కనికరం చూపించండయ్యా!"

"నిన్ను తగలెయ్య!" అని కరబాస్ బరబాస్ గొంతుక చించుకుంటూ అరిచేడు. "కనికరం గినికరం లాంటివేం లేవు. కుందేలూ, కోడిపెట్టలూ నాకు వేగాలి. వూఁ నెగడులో పడు."

"అయ్యా! నావల్ల కాదు!"

"యేం? యెందుక్కాదు?" అని కరబాస్ బరబాస్ అడిగేడు. బురతీనొ తన చెవిలో గుంయ్ మనకుండా అలా మాట్లాడుతూనే వుండేందుకని అడిగాడంతే.

"నేనిదివరకే నెగడులోకి ముక్కు పెట్టబోయేను. కాని కన్నం అయిందంతే."

"యేం చెత్త మాట్లాడతావు?" అని కరబాస్ బరబాస్ ఆశ్చర్యపోయేడు. "నెగడులో ముక్కు పెట్టి కన్నం యెలా చేశావ్?" అన్నాడు.

"నెగడు, దానిమీద కుండ పాత్ర కాన్వాస్‌మీద గీసిన చిత్రాలు, అయ్యా!"

"హా... చ్!" అని కరబాస్ బరబాస్ తుమ్మి యెంత గోల చేశాడంటే ప్యెరో యెడం వేపు వెళ్లిపడ్డాడు. హార్లెక్విన్ కుడి వేపు వెళ్లిపడ్డాడు. బురతీనొ బొంగరంలాగా తిరిగిపోయేడు.



"పాత కాన్వాస్‌మీద నెగడునీ, కుండనీ గియ్యడం యెన్నడన్నా యెరుగుదువూ?"

"మా డాడీ కార్లో చిన్న గదిలో."

"కార్లో! మీ నాన్నా!" అంటూ కరబాస్ బరబాస్ కుర్చీలోనుంచి యెగిరి గెంతేడు. చేతులు వూపేడు. అతని గడ్డం గది అంతా పరుచుకుంది. "అంటే ముసలి కార్లో చిన్న గదిలో వో రహస్యం వుందంటావ్..."

యిక ఆపైన యేమీ అనకుండా కరబాస్ బరబాస్ రెండు చేతులూ పిడికిళ్లు బిగించి నోట్లో కుక్కున్నాడు. అది రహస్యమో యేమిటో దాన్ని గురించి చెప్పదలచుకోనట్టే వుంది అతను. అతనలా మిడిగుడ్లు వేసుకుని ఆరిపోయే మంటకేసి కాసేపు చూస్తూ వుండిపోయేడు.

"బాగుంది!" అన్నాడు ఆఖరికి. "యీ ఉడికీ ఉడకని కుందేల్నీ కోడిపెట్టల్నీ కానిస్తాలే. నిన్ను ప్రాణంతో వదిలేస్తున్నాను. అంతే కాదు అయినా..."

అతను గడ్డం కింద వెయిస్ట్ కోట్ జేబులో తడుముకుని అయిదు బంగారు కాసుల్ని తీసేడు. వాటిని బురతీనొకి అందించేడు.

"అంతే కాదు. వీటిని తీసుకెళ్లి కార్లోకి యియ్యి. నేనడిగానని చెప్పు. అతను ఆకలికీ, చలికీ యెన్నడు చనిపోకూడదని నా విన్నపం అనీ చెప్పు. యింకా ముఖ్యం అయింది అతను నెగడు చిత్రం గీసిన కాన్వాస్ వున్న ఆ గదిని యెప్పుడూ వదిలిపెట్టకూడదు అనీ చెప్పు. వెళ్లు. నిద్రపోయి పొద్దున్నే మొదటగా యింటికి వెళ్లిపో."

బురతీనొ అయిదు బంగారు కాసుల్ని జేబులో వేసుకున్నాడు.

"మీ మేలు మరువనయ్యా! నాకంటే నమ్మకస్థుడు దొరకడు మీకు డబ్బు పంపించడానికి"



అని వొంగి వందనం చేస్తూ అన్నాడు.

హార్లెక్విన్, ప్యెరోలు బురతీనొని కీలుబొమ్మల వసతి గదికి తీసుకువెళ్లారు. అక్కడ మళ్లీ బొమ్మలు అతన్ని కౌగలించుకుని, ముద్దుపెట్టుకుని గిచ్చేయి, తోశాయి, మళ్లీ కౌగలించుకున్నాయి. నెగడులో పడకుండా యే మాయ వల్లో బురతీనొ తప్పించుకున్నాడని సంతోషించేయి.

"యిక్కడ అంతు బట్టనిదేదో జరుగుతోంది" అని అతను బొమ్మలకి రహస్యంగా చెప్పేడు.

## ఇంటిదారిలో బురతీనొ బాసిలో పిల్లి, అలీస ఎఱ్ఱనక్క అనే భికుకుల్ని కలవడం

తెల్లవారుతూనే బురతీనొ డబ్బు లెక్కపెట్టేడు. చేతికి యెన్ని వేళ్లు వున్నాయో అన్ని బంగారు నాణేలు వున్నాయి — అయిదు.

వాటిని గట్టిగా పట్టుకుని యింటికి గెంతుకుంటూ పాడుకుంటూ వెళ్లేడు.

''డాడీ కార్లోకి కొత్త చొక్కా కొంటాను. తాయిలాలు కొంటాను, పీచు మిఠాయి కొంటాను.''

కీలుబొమ్మల థియేటరు, రెపరెపలాడే జెండాల గుడారంనుంచి దూరం వెళ్లగానే అతనికి యిద్దరు భికుకులు కనిపించేరు. దిగాలుగా కనిపిస్తూ దుమ్ము రోడ్డుమీద దిమ్మరిగా తిరిగే భికుకులు. అలీస ఎఱ్ఱనక్క వొకటీ, బాసిలో పిల్లి వొకటీ. నక్క మూడు కాళ్లమీద కుంటుతోంది. పిల్లి గుడ్డిది.

అంతకు ముందు రోజున బురతీనొకి రోడ్డుమీద కనిపించిన పిల్లి కాదు యిది. మరొటి, అయినా దీన్నీ బాసిలో అనే అంటారు, దీనికీ చారలు వున్నాయి. బురతీనొ వాటిని దాటుకుని యెకాయెకీ వెళ్లిపోవాలనుకున్నాడు. కాని అలీస నక్క గుండె కరిగేలా అతన్ని పిలిచింది.

''మాట, మంచి బురతీనొ. యెందాకా? హడావుడి పడుతున్నావ్?''

''యింటికి డాడీ కార్లో దగ్గరికి వెడుతున్నా.''

నక్క యింకా జాలి కలిగేటట్టు నిట్టూర్చింది.

''పాపం కార్లో యింకా మన లోకంలో వున్నాడంటావూ? చాలా నికృష్టంగా వున్నాడు, ఆకలికీ చలికీ.''

''యేమిటీ? నువ్వు చూశావా?'' అని బురతీనొ పిడికిలి విప్పేడు. అయిదు బంగారు నాణేలూ కనిపించేయి.

ఆ డబ్బు చూడగానే నక్క పంజాని చాచకుండా వుండలేకపోయింది. పిల్లి వున్నట్టుండి గుడ్డి కన్నుని విశాలంగా తెరిచింది. దాని కళ్లు ఆకుపచ్చ దీపాల్లాగా మెరిశాయి.

కాని బురతీనొ దాన్ని గమనించలేదు.

''మంచి వాడివి బురతీనొ! ఆ డబ్బుతో యేం చేద్దామనుకుంటావు?''

''డాడీ కార్లోకి కొత్త కోటు కొంటాను. కొత్త పెద్ద బాలశిక్ష కొంటాను...''

''పెద్ద బాలశిక్ష? ఆహా!'' అంది అలీస నక్క తల వూపుతూ. ''చదువువల్ల యేం వొరుగుతుంది? నేను చదివీ, చదివీ తెగ చదివాను తెలుసా? యిప్పుడు చూడు యెలా వున్నానో. మూడు కాళ్ల

మీద నడవాల్సివస్తోంది'' అంది నక్క.

''పెద్ద బాలశిక్ష'' అని గొణిగింది పిల్లి. మీసాలు కదిలేట్టు బుసకొట్టింది. ''ఆ పాడు చదువు వల్లనే నాకు చూపు పోయింది'' అంది.

రోడ్డు పక్కన యెండిపోయిన కొమ్మమీద వో కాకి వొదిగి కూర్చుంది. అది వింది, వింది. ఆఖరికి ''కావ్'' మంది.

''అబద్దాలు! అబద్దాలు!'' అంది.

బాసిలో పిల్లి వొక్క గెంతు గెంతి కాకిని కొమ్మమీదనుంచి గెంటేసింది. కాకి తోక సగం లాగేసింది. అది తప్పించుకుని బయట పడగలిగింది అంతే. మళ్లీ గుడ్డితనం నటించింది.

''యేం దానిమీద అలా విరుచుకు పడ్డావు, బాసిలో?'' అని బురతీనొ ఆశ్చర్యంగా అడిగేడు.

''నాకు గుడ్డి కదా, కనిపించలేదు. చెట్టుమీద కుక్కేమో అనుకున్నాను'' అంది పిల్లి.

బురతీనొ పిల్లితో, నక్కతో కలిసి దుమ్ము రోడ్డుమీద వెళ్లేడు.

''బురతీనొ నువ్వు చాలా తెలివైన వాడివి, బుద్ధిమంతుడివి. నీ డబ్బు పదింతలవడం నీకిష్టమేనా?'' అంది నక్క.



''యెందుక్కాదు? అయినా యెలా అవుతుంది?''

''అబ్బే, చాలా సులభం! మాతో రా.''

''యెక్కడికి?''

''బదుద్దాయి దేశానికి.''

బురతీనొ కొంచెం సేపు ఆలోచించేడు.

''వుహుఁ, నేను తిన్నగా యింటికి పోతా.''

''సరే, నీ యిష్టం. నిన్ను బలవంతం చెయ్యం. నీ ఖర్మ నీది!'' అంది నక్క.

''నీ ఖర్మ నీది!'' అని పిల్లి గొణిగింది.

''నీ రాత నువ్వే పాడు చేసుకుంటున్నావు'' అంది నక్క.

''నీ రాత నువ్వే పాడు చేసుకుంటున్నావు'' అంది పిల్లి.

''నీ బంగారు నాణేలు డబ్బు కుప్పగా మారవు.''

బురతీనొ ఆగేడు. అతని నోరు తెరుచుకుంది.

''చెత్త మాటలు'' అన్నాడు.

నక్క తోక ముడుచుకు కూచుంది, లొట్టలు వేసింది.

''యిదిగో విషయం తేల్చుకుందాం. బడుద్ధాయి దేశంలో మంత్ర పొలం వొకటుంది. దాన్ని అద్భుతాల పొలం అంటారు. ఆ పొలంలో చిన్న గొయ్యి తవ్వి 'హ్రాం, హ్రీం, హ్రైం' అని మూడు సార్లు అనాలి. అప్పుడు అందులోకి కొంత బంగారం పడేసి మట్టి కప్పెయ్యాలి. పైన కొంచెం ఉప్పు చల్లాలి. నీళ్లు పొయ్యాలి. తర్వాత నిద్రపోవాలి. తెల్లవారేక లేచి చూస్తే చిన్న చెట్టు మొలుస్తుంది. దానికి ఆకులు వుండవు. బంగారు నాణేలు వుంటాయి. తెలిసిందా?'' అంది.

బురతీనొ ఆ మాట కొస్తే గెంతేడు కూడా.

''యేం చెత్త మాటలు!'' అన్నాడు.

''సరే పద, బాసిలో, పోదాం!'' అంది నక్క నొచ్చుకున్నట్టు. ముక్కు యెగరేసింది. ''మనల్ని నమ్మకపోతే ఖర్మ, యేం చేస్తాం!'' అంది.

''అబ్బె, లేదు, లేదు. మిమ్మల్ని నమ్ముతున్నాను. బడుద్ధాయి దేశానికి గబగబా పోదాం నడవండి'' అన్నాడు బురతీనొ.



# "మూడు చేపల" పూటకూళ్ల యింట్లో

అలీస నక్కతోనూ, బాసిలో పిల్లితోనూ కలిసి బురతీనొ కొండ దిగువకి వచ్చి పొలాల్లోనుంచి, ద్రాక్షతోటల్లోనుంచి, పైన్‌చెట్ల గుబురుల్లోనుంచి నడిచీ నడిచీ ఆఖరికి సముద్రం వొద్దకి చేరాడు.

కొండమీద వూరు కనిపించింది.

"అబ్బ! బడుద్ధాయి దేశానికి వెళ్లడం మజాకా అనుకున్నావా యేమిటి? కాళ్లు అరిగిపోతాయి!" అని అలీస నక్క నిట్టూర్చి అంది.

సాయంత్రం వేళకి దారి పక్క వో పాత యిల్లు కనిపించింది. దాని కప్పు చదునుగా వుంది. దాని గుమ్మంమీద వో బోర్డు వేలాడుతోంది.




పూటకూళ్ల యింటి యజమాని గబగబా ముందుకి వురికి, బట్ట తలమీదనుంచి టోపీ తీసి వందనం చేసి లోపలికి తీసుకెళ్లాడు.

"రొట్టె పెచ్చులు యేవైనా దక్కితే చాలు" అంది నక్క.

లోపలికి వెళ్లి బురతీనొ తన నేస్తాలతో కలిసి నెగడు దగ్గర కూర్చున్నాడు. నెగడుమీద మంచి మంచి వెన్నో ఉడుకుతున్నాయి, పెనంమీద వేగుతున్నాయి.

నక్క లొట్టలు వేసింది. బేసిలో పంజాల్ని బల్లమీద పెట్టింది. మీసాల మూతిని పంజాలమీద పెట్టుకుంది. తిండిమీదే చూపు పెట్టి వుంది.

"యేమండోయ్ యజమానిగారూ? మాకు మూడు రొట్టె పెచ్చులు పట్టండి" అని బురతీనొ గొప్పగా కేక వేశాడు.

యజమాని దాదాపు వెనక్కి పడినంత పని చేశాడు. యింత ఘనమైన అతిథులు యింత అల్ప మైన దాన్ని కోరడం అతనికి బోలెడు ఆశ్చర్యం కలిగించింది.

"అతను మిమ్మల్ని ఆట పట్టిస్తున్నాడండీ. మా బురతీనొ భలే సరదా అయిన వాడు" అని నవ్వుతూ అంది నక్క.

"మాకు మూడు రొట్టె పెచ్చులు తెండి. అదుగో అక్కడ చక్కగా వేగుతూ వున్న గొర్రె మాంసం కొంత, బాతు మాంసం కొంత, చువ్వలమీద కాలుతూ వున్న పావురాయి మాంసం కొంత, యింకా అప్పచ్చులూ —" అంటూ చెప్పింది నక్క.

"బాగా బలిసిన చేపలు ఆరు" అని అందుకుంది పిల్లి. "యికపోతే నంజుడికి పచ్చి చేపలు కాసిని" అంది.

మొత్తంమీద నక్క, పిల్లి పొయ్యిమీద ఉడికే వాటన్నిట్నీ పురమాయించేయి. బురతీనొకి రొట్టె పెచ్చు మాత్రం మిగిలింది. ఆలీస నక్క, బాసిలో పిల్లి బొమికెలతో సహా అంతా నమిలేశాయి. వాటి పొట్టలు ఉబ్బిపోయేయి. వాటి మూతులు జిడ్డు అయేయి.

"ఓ గంట నడుం వాలుద్దాం. అర్ధరాత్రి సరిగ్గా బయల్దేరదాం. యేమండోయ్! యజమాని గారూ మమ్మల్ని లేపండి మరిచిపోవద్దు" అంది నక్క.

నక్క, పిల్లి మెత్తటి పరుపులమీద వాలి గురకలు కొట్టడం మొదలెట్టేయి. బురతీనొ మూల కుక్కలు పడుకునే పట్టామీద ముడుచుకు పడుకున్నాడు.

అతనికి గుండ్రటి బంగారు ఆకులున్న చెట్టు కలలో కనిపించింది. అతను చెయ్యి చాచేడు, అంతే —

"హేయ్! బురతీనొగారూ! అర్ధరాత్రి అయింది. లేవండి" అని పిలుపు వినిపించింది.

యెవరో తలుపు తట్టేరు. బురతీనొ గెంతి కళ్లు నులుముకున్నాడు. నక్క, పిల్లి అక్కడ లేవు. వాటి పరుపులు ఖాళీగా వున్నాయి.

"మీ మిత్రులు పెందరాళే లేచి, చద్ది తిని వెళ్లిపోయారయ్యా" అని యజమాని అన్నాడు.

"నాతో యేమన్నా చెప్పమన్నారా?"

"ఆయ్! మీరు వో క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా రోడ్డు పట్టుకుని అడివిలోకి పరిగెత్తి పోవాలని నొక్కి చెప్పేరు —"

బురతీనొ గుమ్మం దగ్గరికి పరిగెత్తేడు. కాని యజమాని అడ్డం నుంచుని, నడుంమీద చేతులు పెట్టుకుని చురచుర చూస్తూ అన్నాడు:

"రాత్రి తిన్న దానికి డబ్బెవడిస్తాడు మీ బాబు?"

"అయ్యో! అలాగా! యెంతైందేమిటి?" అని గీమన్నాడు బురతీనొ.

"సరిగ్గా వొక్క బంగారు కాసు."

బురతీనొ సరిగ్గా ఆ సమయంలో యజమాని కాళ్ల సందులోనుంచి జారిపోదా మనుకున్నాడు. కాని యజమాని మాంసం చువ్వ తీసుకున్నాడు. అతని బిరుపైన మీసాలు, చెవులపైన వాలుతున్న జుట్టు కూడా నిట్రటగా లేచాయి.

"దొంగభడవా, డబ్బు కక్కు! లేకపోతే చువ్వతో నల్లిని పొడిచినట్టు పొడిచేస్తాను" అన్నాడు.

దాంతో వున్న అయిదు నాణేల్లోనూ వొక నాణేన్ని చెల్లించుకోవాల్సి వచ్చింది.

రాత్రి చీకటిగా వుంది అని చెప్పడం చాలా సాదాగా చెప్పడమే అవుతుంది. అది కటిక చీకటిగా కన్ను పొడుచుకున్నా కనిపించనంత చీకటిగా వుంది. చుట్టూతా అంతా గాఢ సుషుప్తిలో వుంది. గుడ్లగూబ మాత్రం చప్పుడు చెయ్యకుండా బురతీనొ నెత్తిమీద యెగురుతోంది.

"నమ్మకు! జాగ్రత! జాగ్రత!" అని అది హెచ్చరించింది, తన మెత్తని రెక్కని బురతీనొ ముక్కుమీద రాస్తూ హెచ్చరించింది.

బురతీనొ చిరాకు పడి ఆగేడు.

"యేం కావాలి?"

"ఆ పిల్లీ, నక్కా వున్నాయి జాగ్రత!"

"అబ్బ! పోదూ" అతను ముందుకు పరిగెత్తేడు.

గుడ్లగూబ గొణగడం వినిపించింది:

"దారిలో దొంగలున్నారు జాగ్రత!"



# బురతీనొని దొంగలు అడ్డుకొట్టడం

ఆకాశం అంచున ఆకుపచ్చ మెరుపు కనిపించింది. చంద్రోదయం అయింది. యెదర చీకటి అడివి. బురతీనొ గబగబా నడిచేడు. అతని వెనక కూడా యెవరో నడక వేగం పెంచేరు.

బురతీనొ పరుగు అందుకున్నాడు. వెనక వెంబడించి వచ్చేవాళ్లు యెవరో మరి. వాళ్లూ చప్పుడు చెయ్యకుండా పరుగు అందుకున్నారు. బురతీనొ వెనక్కి తిరిగేడు.

రెండు జీవులు అతని వెనక వస్తున్నాయి. వాటి తలలమీద ముసుగులు కప్పుకున్నాయి. వాటికి రెండేసి కంతలున్నాయి. వాటిల్లోనుంచి అవి చూస్తాయి.

ఆ జీవుల్లో వొకటి పొట్టిగా వుంది, బాకుని వూపుతోంది. రెండోది పొడుగ్గా వుంది. పిస్టల్ పట్టుకుంది. దాని మజిల్ గరాటాలాగా వుంది.

"రక్షించండి! రక్షించండి!" అని బురతీనొ అరిచి కుందేలులాగా అడివి వేపు పరిగెత్తేడు.

"ఆగు! ఆగు!" ఆ దోపిడీ దొంగలు అరిచేరు.

బురతీనొకి మతిపోయింది. తనకి యేం మూడబోతోందో అర్థమైంది. వున్న నాలుగు బంగారు కాసుల్ని నోట్లో దాచేసుకున్నాడు. రోడ్డుమీదనుంచి పొదలకేసి వెళ్లిపోయేడు. గచ్చ తీగలు వొత్తుగా పాకిన పొద. కాని అక్కడ ఆ దొంగలు అతన్ని పట్టుకున్నారు.

"యేదీ డబ్బిస్తావా ప్రాణం తియ్యమంటావా?"

వాళ్లనే ముక్క తనకి అర్థం కావడం లేదన్నట్టు బురతీనొ ఆయాస పడుతూ అలా నుంచుండి పోయేడంతే. ఆ దొంగలు అతన్ని మెడ పట్టుకు గుంజేరు. వొక దొంగ పిస్టల్‌తో బెదిరిస్తే రెండో దొంగ బురతీనొ జేబులు వెతికేడు.

"యేదీ డబ్బు?" అని పొడగరి గదమాయింపు.

"నీ దగ్గరున్న డబ్బు! పుచ్చు కుక్క!" అని పొట్టి దొంగ బుస.

"నిన్ను ఖండఖండాలుగా చీల్చేస్తా!"

"నీ తల నేను నరికేస్తా!"

బురతీనొకి వణుకు, దడ పట్టుకున్నాయి. దాంతో నోట్లో వున్న బంగారు కాసులు మోగి చప్పుడు చేశాయి.

"అద్గదీ! డబ్బు అక్కడుంది నాన్నా! నోట్లో!" అని దొంగలు అరిచేర్లు.

వొక దొంగ బురతీనొ తల పట్టుకుంటే రెండో దొంగ కాళ్లు పట్టుకుని యెగరేసీ, కుదేసీ కుదిపేసీ చేసినా బురతీనొ పళ్లు గట్టిగా బిగించేసి తెరవలేదు.

ఆ దొంగలు అతన్ని తల కిందులు చేసి నేలమీద మోదేశారు, కాని ఫలితం లేకపోయింది.

అప్పుడు పొట్టి దొంగ బాకుతో బురతీనొ నోరు బలవంతాన తెరవబోయేడు. యిక కొంచెం వుంటే బిగబట్టిన పళ్లు వదులవుతాయంతే, ఆ సమయంలో బురతీనొ లాఘవంగా విదిలించుకుని దొంగ చేతిని గట్టిగా కొరికేడు. తీరా చూస్తే అది చెయ్యి కాదని తేలింది. అది పిల్లి పంజా. దొంగ బేర్‌మని అరిచేడు. సరిగ్గా అదే అదునులో బురతీనొ బల్లిలాగా ఆ దొంగల పట్టునుంచి విడిపించుకుని పొదల దగ్గరికి దూసుకుపోయేడు. గచ్చ పొదల్లోకి దూరిపోయేడు. ముళ్లకి తగులుకుని అతని చొక్కా, లాగు పీలికలైపోయాయి. పాక్కుంటూ అవతలి వేపు వెళ్లిపోయేడు, అడివి కేసి పారిపోయేడు.

అడివి అంచున దొంగలు మళ్లీ అతన్ని అందుకున్నారు. అతను యెగిరి గెంతి వో కొమ్మని పట్టుకుని చెట్టెక్కేశాడు. దొంగలూ అతని వెనక్కాలే యెక్కేరు. కాని తలలకి తగిలించుకున్న ముసుగులు అడ్డం పడ్డాయి.

చిటారు కొమ్మకంటా యెక్కేసి బురతీనొ వూగి పక్క చెట్టుమీదకి గెంతేడు. దొంగలు అప్పటికీ వెన్నంటి వస్తూనే వున్నారు.



కాని అక్కడ మాత్రం పట్టు తప్పిపోయి తపామని నేలమీద పడిపోయేరు.

దొంగలు కుయ్యో మొర్రోమంటూ బుర్రలు గోక్కుంటూ వుండగా బురతీనొ చెట్టుమీద నుంచి జారి పరుగు లంకించుకున్నాడు. యెంత గబగబా పరిగెత్తేడంటే అసలు అతని కాళ్లు కదలడం కనిపించనేలేదు.

వెన్నెలలో చెట్ల నీడలు బారుగా పడుతున్నాయి. అడివి అంతా వెలుగు నీడల్తో వుంది.

బురతీనొ వొక నీడలో మాయమైపోయేడు. అంతట్లోకీ కోసుగా వున్న అతని టోపీ వెన్నెల్లో మెరిసేది.

అలా అలా వెళ్లి వెళ్లి వో సరస్సు చేరుకున్నాడు. సరస్సు ఉపరితలంమీద చంద్రుడు ప్రతిఫలించేడు, కీలుబొమ్మల థియేటర్‌లో మాదిరిగానే.

బురతీనొ కుడి వేపు దూసకు పోయేడు. కాని అక్కడ చిత్తడిగా వుంది. యెడం వేపు తిరిగేడు, అక్కడా యింకో బాడవ వుంది. వెనక్కాలనుంచి కొమ్మలు విరుగుతూ వుండడం టపటపమంటూ వుండడం వినిపిస్తూనే వుంది.

''పట్టుకోండి! అతన్ని పట్టుకోండి!''

దొంగలు అతని దగ్గరికి వచ్చేస్తున్నారు. తడి గడ్డిమీదపైకి గెంతుతున్నారు అతన్ని చూడ్డానికి.

''అదుగో!''

యిక మిగిలింది వొక్కటే. నీళ్లల్లోకి దూకెయ్యడమే. సరిగ్గా అప్పుడతనికి వో తెల్ల హంస కనిపించింది. అది తల రెక్కలో దూర్చుకుని వొడ్డు దగ్గర నిద్రపోతోంది.

బురతీనొ నీళ్లల్లోకి దూకి వెళ్లి దాని కాళ్లని పట్టుకున్నాడు.

''క్ — క్ — క్'' అని లేచి హంస అరిచింది. ''యేమిటిది? వెధవ టక్కులు! నా కాళ్లు వదులు'' అంది.

అది పెద్ద రెక్కల్ని కొట్టుకుంది. నీళ్లల్లోనుంచి పైకి వచ్చిన బురతీనొ కాళ్లని దొంగలు పట్టుకోబోతూ వుండే సమయంలో అది దర్జాగా సరస్సు గుండా యెగిరిపోయింది. సరస్సు అవతలి వేపు వెళ్లాక బురతీనొ దాని కాళ్లు వొదిలేశాడు, నేలమీద ధనామని పడ్డాడు. పైకి గెంతి కొండలమీద వున్న పెద్ద చంద్రునికేసి గుట్టలమీదా గొప్పలమీదా గెంతుకుంటూ పోయేడు.



# దొంగలు బురతీనొని చెట్టుకి వేలాడదీయడం

బురతీనొ చచ్చేటట్టు అలిసిపోయేడు. అడుగు తీసి అడుగు వెయ్యలేనట్టుగా అలిసిపోయేడు.

హఠాత్తుగా అతనికి హేజెల్ గుబురుల మధ్యనుంచి ముచ్చటైన పచ్చిక బీడు కనిపించింది. దాని మధ్యలో వో కుటీరం కనిపించింది. దానికి నాలుగు కిటికీలు వున్నాయి. వెన్నెలలో అది బాగా కని పించింది. తలుపులమీద సూర్యుడి బొమ్మ, చంద్రుడి బొమ్మ, నక్షత్రాల బొమ్మలు వున్నాయి. చుట్టూతా ధగద్ధగాయమానంగా నీలం పువ్వులు విరిశాయి.

బాటలు తాజాగా యిసిక పరిచి వున్నాయి. వో ఫౌంటెన్ పైకి నీటిని యెగజిమ్ముతోంది. ఆ ధారపైన వో చిన్న చారల బంతి పైకి లేస్తూ కిందికి పడుతూ వుంది.

బురతీనొ పాక్కుంటూ వెళ్లి మెట్ల పైకి యెక్కి తలుపు తట్టేడు. లోపల యెక్కడా అలికిడి అయినట్టు లేదు. మళ్లీ గట్టిగా తలుపు తట్టేడు. బహుశా యింట్లో వాళ్లు గట్టి నిద్రలో వున్నారేమో.

సరిగ్గా అప్పుడు దొంగలు అడివిలోనుంచి దూసుకు వచ్చేరు. సరస్సులో యీది వచ్చేరు, అంచేత నీళ్లు కారుతున్నాయి. బురతీనొని చూడగానే పొట్టి దొంగ పిల్లిలాగా కస్సుమన్నాడు. పొడగరి దొంగ నక్కలాగా కూశేడు.

బురతీనొ తలుపుమీద చేతులతో కాళ్లతో మోదేడు.

"రక్షించండి! రక్షించండి! నాయనలారా!" అని అరిచేడు.

అప్పుడు కిటికీలోనుంచి వో ముచ్చటైన చిన్న అమ్మాయి తల యివతలికి పెట్టింది. ఆ అమ్మాయి జుట్టు ఉంగరాల జుట్టు, అందంగా వుంది. ఆమె ముక్కు అందంగా కోసుగా వుంది.

ఆమె కళ్లు మూసుకుంది.

"పాపా! తలుపు తియ్యి! దొంగలు తరుము కొస్తున్నారు."

"యేమిటీ గోల!" అంది ఆ పాప. ఆమెకి చిన్న ముచ్చటైన నోరు వుంది. ఆమె ఆవులించింది. "యెంత నిద్రగా వుందో — కళ్లు తెరవలేకుండా వున్నాను."

ఆమె చేతులు యెత్తింది. నిద్రమత్తుగా చాచింది. కిటికీ దగ్గర్నుంచి మాయమైపోయింది.

దిక్కు తోచక బురతీనొ దారిమీద బోర్లపడి చచ్చిపోయిన వాడిలాగా నటించేడు.

దొంగలు యెగురుకుంటూ వచ్చేరు.

"ఆహా! తప్పించుకుపోగలవూ!"

బురతీనొ నోరు తెరిపించేందుకు వాళ్లు యిది చెయ్యలేదు, అది చేశారూ అని చెప్పలేం. వాళ్లు

ఆ తరుముకుపోవడంలో కత్తినీ, పిస్టల్‌నీ పారేసుకున్నారు. లేకపోయి వుంటే బురతీనొ పని అంతే సంగతులు అయివుండేది.

దాంతో ఆ దొంగలు బురతీనొని తల్ల కిందులుగా వేలాడదియ్యాలని తీర్మానించుకున్నారు. అతని కాళ్లకి తాడు కట్టి, ఓకు చెట్టు కొమ్మకి వేలాడదీశారు. వాళ్లు చెట్టు కింద కూర్చున్నారు. నీళ్లు కారే తోకల్ని చాచుకుని బురతీనొ నోట్లోనుంచి బంగారు నాణేలు వూడి పడడం కోసం యెదురు చూస్తూ వున్నారు.

తెల్లవారకట్ల గాలి లేచి, ఓకు చెట్టు ఆకులు గలగల లాడేయి. బురతీనొ తెగిన కొమ్మలాగా వూగిపోయేడు. కూర్చునీ కూర్చునీ దొంగలకి విసుగొచ్చేసింది.

''సాయంత్రం దాకా అలానే వూగుతూ వుండు'' అని కసిగా తిట్టి దారి పక్క పూటకూళ్ల యిల్లు యేదన్నా వుందేమో చూద్దాం అని వెతుక్కుంటూ పోయేరు.



# నీలం జుట్టు చిన్న అమ్మాయి బురతీనొకి ప్రాణభిక్ష పెట్టడం

బురతీనొ ఓకు చెట్టు కొమ్మలమీద వేలాడుతూ వున్నాడు. ఆవలనుంచి తూరుపు రేకలు విచ్చు కుంటూ వచ్చేయి.

లోయలోని గడ్డి బూడిద వర్ణం తిరిగింది. ధగధగ మెరిసే నీలం పువ్వులమీద చిన్న మంచు బిందువులు కమ్మేయి.

నీలం రంగు ఉంగరాల జుట్టు వున్న చిన్న అమ్మాయి మళ్లీ కిటికీలోనుంచి యివతలకి చూసింది. నిద్రమగతగా వున్న అందమైన కళ్లని నులుముకుంది. కళ్లు తెరిచింది.

ఆ చిన్న అమ్మాయి శ్రీమాన్ కరబాస్ బరబాస్ కీలుబొమ్మల థియేటర్‌లో యెంతో అందమైన బొమ్మ.

యజమాని తిక్క చేష్టలు భరించలేక ఆ అమ్మాయి పారిపోయి వచ్చేసి ఆ లోయలోని వొంటరి చిన్న కుటీరంలో చేరింది.

జంతువులు, పక్షులు, కొన్ని పురుగులు కూడా ఆ పిల్ల అంటే అభిమానం పెంచుకున్నాయి. ఆమె మంచి పిల్ల కావడంవల్లా, పెంపకం మంచిది అయినందువల్లా అలా అభిమానించి వుండవచ్చు.

అవి ఆమెకి యేమేం కావాలో వాటిని అమర్చిపెట్టేవి.

ఓ మోల్ దుంపలు తెచ్చి పెట్టేది.

చుంచులు పంచదార, జున్ను వగైరా తెచ్చి పెట్టేవి.

ఆర్తెమాన్ అని పిలిచే మంచి కుక్క ఆమెకి రొట్టె తెచ్చి పెట్టేది.

కౌజు పిట్ట ముచ్చి కాగితం చుట్టిన చాకొలెట్‌లు బజార్లోనుంచి కాజేసి తీసుకువచ్చేది.

కప్పలు చిన్న చిప్పల్లో నిమ్మరసం తెచ్చేవి.

డేగ ఆమెకి వేయించిన పిట్ట మాంసం తెచ్చి పెట్టేది. పురుగులు ఆమెకి నానారకాల గింజలు, పళ్ళూ తెచ్చి పెట్టేవి.

సీతాకోకచిలకలు ఆమెకి పుప్పొడి తెచ్చి పెట్టేవి. అది ఆమెకి ముఖానికి రాసుకునే పౌడరు.

గొంగళి పురుగులు తమని పిండుకుని పిండి తీసి యిచ్చేవి. అది ఆమెకి పళ్లు తోముకోవడానికీ, యే తలుపులన్నా కిర్రుమంటే పూయడానికీ పనికి వచ్చేది.

స్వాలో పిట్టలు యింటి చుట్టుతా పురుగూపుట్రా లేకుండా చేసేవి.

నీలం రంగు జుట్టు వున్న చిన్న అమ్మాయి కళ్లు తెరిచి చూసింది. బురతీనొ తల కిందులుగా ఓకు చెట్టుకి వేలాడుతూ కనిపించేడు.



ఆమె చెంపలమీద చేతులు పెట్టుకుని అరిచింది:

''అయ్యో! అయ్యో! అయ్యో!''

కుక్క ఆర్తెమాన్ కిటికీ దగ్గరికి వచ్చింది. చెవులు ఆడించింది. అది అప్పుడే వెనక భాగం క్షవరం చేసుకుంది. అలా అది రోజూ చేసుకుంటుంది. శరీరం ముందు భాగంలో వున్న ఉంగరాల బొచ్చుని బాగా దువ్వుకుంది. తోక కుచ్చుని నల్లని రిబ్బన్‌తో కట్టుకుంది. ముందు కాలికి వెండి రిస్టువాచీ పెట్టుకుంది.

''వచ్చేను!'' అంది.

ముక్కు వో వేపు తిప్పింది, పై పెదవి మెత్తింది. దాని తెల్లని పళ్లు కనిపించేయి.

''ఆర్తెమాన్! యెవళ్లనన్నా పిలు!'' అందా అమ్మాయి. ''పాపం, బురతీనో! అతన్ని కిందికి దింపి లోపలికి తీసుకు రావాలి. డాక్టరుకి కబురు చెయ్యాలి!'' అంది.

''అలాగే!''

ఆర్తెమాన్ వెళ్లే తొందర్లో గిరుక్కున తిరగడంతో దారిమీద చెమ్మగా వున్న ఇసక వెనక కాళ్ల కిందనుంచి లేచింది. అది వో చీమల పుట్ట దగ్గరికి దూసుకుపోయింది. చీమలన్నీ దాని మొరుగు విని లేచేయి. నాలుగు వందల చీమలు బురతీనో వేలాడుతూ వున్న తాడు కొరకడానికి బయల్దేరాయి.

నాలుగు వందల చీమలు సైనికులలాగా వొక వరసలో వెళ్లి చెట్టు యెక్కి తాటిని కొరికేయి.

బురతీనో కింద పడగానే ఆర్తెమాన్ ముందు కాళ్లతో అతన్ని పట్టుకుని యింట్లోకి తీసుకు వచ్చింది. బురతీనొని మంచంమీద పడుకోబెట్టి, పిక్కబలం కొద్దీ పరిగెత్తి వెళ్లింది. అడివి బాగా దట్టంగా వుండే చోటుకి వెళ్లింది. రెప్పమూసి తెరిచే వ్యవధిలో ప్రసిద్ధ వైద్యులు డాక్టర్ గుడ్లగూబని తీసుకుని వచ్చింది. డాక్టరు గుడ్లగూబ స్పెషలిస్టు. గుడ్లగూబ అసిస్టెంటు శ్రీ భేకం, గొల్లభామ అనే నాటు వైద్యుణ్ణి కూడా తీసుకు వచ్చింది. గొల్లభామ యెండు పుల్లలా వుంది.

గుడ్లగూబ బురతీనొ ఛాతీ దగ్గర చెవి పెట్టి వింది.

"రోగి ప్రాణం పోయినట్టు కనిపిస్తోంది" అని మెల్లిగా గొణిగి లాభం లేదన్నట్టు తల తిప్పింది.

భేకం చాలా సేపు చెమ్మగా వున్న చేత్తో బురతీనొని తడిమి చూస్తూ వుంది. అది ఆలోచనలో వుండగా దాని మిడిగుడ్లు యేక కాలంలో అన్ని వేపులకీ చూస్తూ వున్నట్టు కనిపించేయి.

"రోగి ప్రాణం పోనట్టు కనిపిస్తోంది" అంది.

గొల్లభామ నాటు వైద్యుడు గడ్డి పోచల్లా కనిపించే పొడుగాటి పుల్ల వేళ్లతో బురతీనొని తడిమింది.

"యేదో వొకటి అయివుండాలి, యిదో అదో" అంది గలగలలాడే గొంతుకతో. "రోగి బతికేనా వుండాలి, చనిపోయేనా వుండాలి. బతికి వుంటే బతుకుతాడు, లేకపోతే లేదు. చనిపోయినా మనం బతికించగలం లేకపోతే లేదు" అంది.

"నా... న్నా... న్నాటు వైద్యం" అని గుడ్లగూబ మెత్తని రెక్కలు కొట్టుకుని చీకటి అటక మీదకి యెగిరిపోయింది. భేకానికి స్రరున కోపం వచ్చేసింది. దాని బొడిపెలు అన్ని ఉబ్బిపోయేయి.

"యె... యెంత వెలపరం పుట్టించే పొగరు మోత్తనం!" అని బెకబెకలాడింది. పొట్టతో గుడ గుడ చప్పుడు చేసింది. యెగిరిగెంతి చీకటి మూలకి పోయింది.

గొల్లభామ నాటు డాక్టరు యేదన్నా అత్యవసర పరిస్థితి వస్తే యెండు పుల్లలా వాలకం పెట్టేస్తుంది. అలా పెట్టి అదీ కిటికీలోనుంచి వెళ్లిపోయింది.

నీలం రంగు జుట్టు వున్న అమ్మాయి అయ్యో యేం చెయ్యాలి అన్నట్టు చేతులు వూపింది.

"వూః! సరేనండీ! బాబులూ! యెలా యితన్ని బాగు చెయ్యడం?"

"ఆవదంతో" అని భేకం మూలనుంచి అరిచింది.

"ఆవదంతో" అని గుడ్లగూబ అటకమీదనుంచి కూసింది.

"ఆవదంతో గాని, ఆవదం లేకుండా గాని" అని గొల్లభామ కిటికీ బయటనుంచి అంది.

ఆ సమయంలో దెబ్బలు తిని నలిగిపోయి చావు సిద్దమై వున్న నిర్భాగ్యుడు బురతీనొ కదిలి మూలిగేడు. "ఆవదం గీవదం అక్కర్లేదు. నాకు హాయిగా వుంది" అన్నాడు.

నీలం రంగు జుట్టు వున్న అమ్మాయి సుకుమారంగా అతనిమీదకి వాలింది.

"బురతీనొ! మా మంచి వాడివి కాదూ! గట్టిగా కళ్లు మూసేసుకుని ముక్కు మూసుకుని దీన్ని తాగు."

"వూహుః, వద్దు, వద్దు, వద్దు."

"మా బుజ్జివి కదూ, తాగితే చక్కెర బిళ్ల యిస్తా."

అప్పుడే వో తెల్ల చుంచు చక్కెర బిళ్లని పట్టుకుని మంచం పైన దుప్పటీ యెక్కింది.

"నే చెప్పిన మాట వింటే నీదే యిది" అంది చిన్న పిల్ల.

"నాకా చక్కెర బిళ్ల చాలు."

అప్పుడు పెద్ద వాళ్లల్లా కఠినంగా అంది.

"ముక్కు మూసుకుని కప్పుకేసి చూడు. వొకటి, రెండు, మూడు" అని ఆవదాన్ని బురతీనొ గొంతుకలో పోసింది. వెంటనే చక్కెర బిళ్లని తోసింది. అతన్ని ముద్దుపెట్టుకుంది.

"అదీ, మరి అలా వుండాలి."

అన్నీ సవ్యంగా సాగిపోతూ వుంటే సంతోష పడే మంచి కుక్క ఆర్తెమాన్ తన తోకని పళ్లతో కొరుక్కుంటూ కిటికీ కింద చక్కర్లు కొడుతూ గెంతింది. వొళ్లంతా చెవులూ, పంజాలు అయినట్టు కనిపిస్తూ కళ్లు మెరుస్తూ వున్నట్టు కనిపిస్తూ సుళ్లు తిరిగింది.



# బురతీనొకి నీలం జుట్టు అమ్మాయి మంచి నడవడిక, చదువు నేర్పడం

పొద్దున్నే బురతీనొ పువ్వులాగా లేచాడు. అసలు యేమీ జరగనట్టే ఆరోగ్యంగా వున్నాడు.

నీలం జుట్టు చిన్న అమ్మాయి అతని కోసం తోటలో చూస్తూ కూచుంది. వో చిన్న బల్లమీద బొమ్మల పింగాణీ సామాను పెట్టుకుని కూచుంది. ఆమె హాయిగా ముఖం కడుక్కుంది. ఆమె బుగ్గలమీదా కోసు తిరిగిన ముక్కుమీదా పుప్పొడి పౌడరు అద్దుకుంది.

ఆమెకి సీతాకోకచిలకలతో విసుగ్గా వుంది. బురతీనొ కోసం యెదురు చూస్తూ సీతాకోకచిలకల్ని తరిమేస్తూ చేతులు విసురుకుంది.

"అబ్బ! గోలాని!" అంది.

ఆమె ఆపాదమస్తకం అతన్ని చూసింది. ముఖం చిట్లించుకుంది. అతన్ని బల్ల దగ్గర కూచోమంది. బుల్లి కప్పులో కొంచెం కోకో పోసింది.

బురతీనొ కూచుని వో కాలిని కిందికి మడుచుకున్నాడు. నిమ్మతొనలని నోట్లో కుక్కుకున్నాడు, నమలకుండానే మింగేడు. వేళ్లని జామ్ జాడీలో పెట్టి లొట్టలు వేస్తూ నాకేడు. ఆ చిన్న అమ్మాయి వో పెద్ద కందిరీగకి కాస్త యేదన్నా విదుపుదామని తిరగ్గానే బురతీనొ కూజా అంది పుచ్చుకుని కోకో గడగడ తాగేశాడు. దాంతో పొలమారి బల్లమీదా, టేబిల్ క్లాత్‌మీదా అది వొలికింది.

"సరిగ్గా కూర్చో" అని ఆ అమ్మాయి గదమాయించింది. "రెండు కాళ్లూ బల్ల కిందికి పెట్టు. చేత్తో తినకు. ఫోర్కులూ, స్పూన్‌లూ వున్నాయి కదా."

ఆమె కంటి రెప్పలు కోపంతో కదిలేయి.

"యెవరు నీకు చదువు చెపుతున్న వాళ్లు?" అంది.

"కొద్దిగా డాడీ కార్లో చెప్పేడు. ఆ తర్వాత యెవళ్లూ లేదు."

"సరే అయితే, నేనే యికమీద నీకు చదువు చెప్తా, వూఁ."

"చచ్చాఁనా నాయనా" అనుకున్నాడు బురతీనొ.

యింటి దగ్గర గడ్డిమీద ఆర్తెమాన్ కొన్ని చిన్న పిట్టల్ని తరుముతోంది. అవి చెట్లమీదకి యెగిరిపోతూ వుంటే మెడ చాచి ఆతృతగా గీమంటూ అరుస్తూ యెగురుతోంది.

"హుఫ్! తను పిట్టల్ని తరుముతోంది, బాగానే వుంది" అని అసూయగా బురతీనొ అనుకున్నాడు.

బురతీనొ మర్యాదగా బల్ల దగ్గర కూర్చున్నాడు, అతని వొళ్లంతా తిమ్మిరెక్కింది.

మొత్తంమీద ఆ నాస్తా అయింది. ముక్కుమీదనుంచి కోకో తుడుచుకొమ్మని ఆ అమ్మాయి

అతనికి చెప్పింది. ఆమె తన గౌను జడలని, రిబ్బన్లని సవరించుకుంది. బురతీనొ చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకు వెళ్లింది — చదువు చెప్పడానికి. ఈ లోపున హుషారుగా వున్న కుక్క ఆర్తెమాన్ మొరుగుతూ గడ్డిమీద పరిగెడుతూనే వుంది. అదంటే పిసరు కూడా భయం యెరగని పిట్టలు సంతోషంగా కిచకిచ మంటున్నాయి. పిల్ల తెమ్మెర చెట్ల శిఖరాలమీద వీచింది.

"యీ పీలికలు విప్పెయ్యి. నీకు మంచి చొక్కా లాగు యిస్తాను" అంది ఆ అమ్మాయి.

నలుగురు టైలర్లు అతనికి అందమైన సూటుని ఆ అమ్మాయి పాత బట్టల్లోనుంచి కుట్టి పెట్టారు. శ్రీమాన్ గాజురొయ్య, చిన్న కుచ్చు టోపీ పెట్టుకుని బూడిదరంగుతో వున్న శ్రీమాన్ వడ్రంగి పిట్ట, శ్రీమాన్ స్టాగ్ బీటిల్, చుంచు ఆ నలుగురు టైలర్లు. గాజురొయ్య గుడ్డ కట్టింగ్ చేసింది. వడ్రంగి పిట్ట ముక్కులో చిల్లులు చేసి కుట్టింది. స్టాగ్ బీటిల్ దారం పోనిచ్చింది. చుంచు పళ్లలో కొరికింది, కుట్టు పని సాగించింది. ఆ అమ్మాయి తొడిగి విడిచేసిన గుడ్డలతో కుట్టిన బట్టలు కట్టుకోవడానికి బురతీనొకి సిగ్గయింది. కాని అతను బట్టలు మార్చుకోవాల్సి వచ్చింది. అతను గట్టిగా యెగబీల్చి కొత్త చొక్కా జేబులో బంగారు కాసుల్ని దాచుకున్నాడు.

"వూఁ, కూర్చో, చేతులు ముందుకి పెట్టు. ముణగలాక్కోకు" అని ఆ అమ్మాయి సుద్ద ముక్క తీసుకుని అంది. "లెక్కలు చెపుతా. నీ జేబులో రెండు ఆపిల్స్ వున్నాయనుకో — "

"వుహుఁ వొట్టిది, లేవు" అన్నాడు.

"వున్నాయనుకో" అని ఆ అమ్మాయి రెట్టించింది. "నీ జేబులో రెండు ఆపిల్ పళ్లు వున్నాయనుకో. యెవళ్లో వొక పండు తీసేసుకున్నారు. అప్పుడు నీ జేబులో యెన్ని పళ్లుంటాయి?" అని అడిగింది.

"రెండు."

"సరిగా వూహించు."

బురతీనొ కనుబొమలు ముడుచుకుని గట్టిగా ఆలోచించేడు.

"రెండు."

"యెలా?"

"హుమ్! నేను యెవళ్లకీ ఆపిల్ యివ్వను. వాళ్లు దెబ్బలాడి చచ్చినా సరే."

"హుఫ్! యెంత మొత్తుకున్నా నీకు లెక్కలు రావు. తేలిపోయింది" అందామె. ఆమెకి బాధనిపించింది. "సరే, డిక్టేషన్ చూద్దాం" అంది.

ఆమె ముచ్చటైన కళ్లు కప్పుకేసి చూశాయి.

"రాయి. 'వికటకవి.' అయిందా? మళ్లీ చదువు. మంత్రంలాగా వుందీ మాట."



మనకి తెలుసు కదా, బురతీనొ అంతకు ముందెన్నడు వో పెన్ను గాని, సిరాబుడ్డి గాని చూళ్లేదు.

''రాయి'' అని ఆ అమ్మాయి అనగానే ముక్కు సిరాబుడ్డిలో ముంచి కాగితంమీద మరక చేశాడు. అందుకు భయం వేసింది.

ఆ అమ్మాయి ఆశ్చర్యంతో చేతులు యెగ రేసింది. ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగేయి.

''నువ్వు దుందుడుకు వాడివి. నీకు శిక్ష పడాలి.''

ఆమె కిటికీలోనుంచి బయటికి అనుకుంది.

''ఆర్తెమాన్, బురతీనొని తీసుకెళ్లిపోయి చీకటి కొట్టు గదిలో పెట్టెయ్యి'' అంది. మంచి కుక్క ఆర్తెమాన్ గుమ్మం దగ్గర ప్రత్యక్ష మైంది. దాని పళ్లు మెరిశాయి. అది బురతీనొ చొక్కా పట్టుకుని బరబరా వెనక్కి కొట్టు గదికి యీడ్చుకుపోయింది. అక్కడ సాలెగూళ్లు అల్లుకు న్నాయి. వాటిలో పెద్ద పెద్ద సాలెపురుగులు వున్నాయి. యెటు చూసినా అవే. ఆర్తెమాన్ బురతీనొని అక్కడ పెట్టి బంధించేసి, భయపెట్టేందుకు అరిచి, మళ్లీ పిట్టలని తరమడానికి వెళ్లిపోయింది.

ఆ అమ్మాయి చిన్న లేసు బొమ్మ పడకమీద వాలింది. వెక్కివెక్కి యేడ్చింది. తను ఆ చిన్న కొయ్య బొమ్మని అంత క్రూరంగా చూశేను కదా అని యేడ్చింది. కాని చదువు చెప్పడం మొదలు పెట్టింది కదా, అంచేత పూరాగా చెప్పాలని నిర్ణయించుకుంది.

యీ లోపున బురతీనొ చీకటి కొట్లో గొణుక్కుతున్నాడు: ''యేం పాడు పిల్ల!... తనేం రాణీ అనుకుందా? హుఫ్! యింతా చేసి తనకి వున్నది పింగాణీ తలకాయ, దూది కూరిన వొళ్లు!''

చీకట్లో యెవళ్లో నీరసంగా మూలిగినట్టైంది. యెవళ్లో చిన్న పళ్లతో పటపట కొరుకు తున్నట్టు అయింది.

''విను! విను!''

బురతీనొ సిరామరకలైన ముక్కుని పైకి యెత్తేడు. చీకట్లో తల కిందులుగా వేలాడుతూ వున్న గబ్బిలాయి కనిపించింది.

''యేమిటిది?''

''రాత్రయే దాకా వుండు, బురతీనో.''

''హుష్, హుష్!'' అని సాలెపురుగులు అన్ని వేపులనుంచీ అన్నాయి. ''మా సాలెగూళ్లని చింపకు. యీగల్ని తరిమేస్తావు నువ్విక్కడనుంచి'' అన్నాయి.

బురతీనో పగిలిన కుండమీద కూర్చున్నాడు. చేతుల్లో తల పెట్టి కూర్చున్నాడు. అతనికి యింతకంటే యెక్కువ ఘోరాలు జరిగేయి. కాని యిప్పుడు తనకి జరిగిన అన్యాయంతో కుతకుతలాడి పోతున్నాడు.

''వీళ్లు యిలాగే పిల్లల్ని పెంచుతారా?'' అనుకున్నాడు. ''యిది చదువా? ఛీభ!.. కూర్చో లేరు, తినలేరు యిలా అయితే. ప్రతి పిల్లాడు యిలాగే అక్షరాలు నేర్చుకుంటాడా? ఆమె సర్న వెళ్లి సిరాబుడ్డి తెచ్చేసింది... ఆ కుక్క పిట్టల్ని తరుముతోంది. అది ఫర్లేదులా వుంది'' అనుకు న్నాడు.

మళ్లీ గబ్బిలాయి కీచుమంది.

''రాత్రయే దాకా వుండు బురతీనో! నిన్ను బడుద్దాయి దేశానికి తీసుకువెడతా. అక్కడ సరదాగా ఆడే పాడే వేళ నీకు, పిల్లీ నక్కలతో ఆడుకుంటూ. చీకటి పడే దాకా వుండు'' అంది.



# బురతీనొ బడుద్ధాయి దేశం చేరడం

నీలం జుట్టు చిన్న అమ్మాయి కొట్టు గది దగ్గరికి వెళ్లింది.

"బురతీనొ! బుజ్జి! తప్పు చేశాననిపిస్తోందా?"

బురతీనొకి కోపం వచ్చింది. పైగా అతని బుర్ర యెక్కడ్నో ఆలోచిస్తోంది.

"నేనేం తప్పు చెయ్యలేదు. అందుకని — "

"సరే అయితే, యీ కొట్టు గదిలో తెల్లవార్లూ కూచావాల్సివస్తుంది."

గట్టిగా నిట్టూర్చి ఆమె వెనక్కి తిరిగి వెళ్లిపోయింది.

రాత్రయింది. అటకమీద గుడ్లగూబ కూసింది. మూలనుంచి భేకం యివతలకి వచ్చింది. వెన్నెలలో ప్రతిఫలించే నీళ్లకుంటల్లో పొట్టతో కొట్టుకుంది.

ఆ చిన్ని అమ్మాయి లేసు పరుపుమీద వాలింది. యేడ్చి యేడ్చి నిద్రపోయింది.

ఆర్తెమాన్ తల తోక కింద దూర్చి ఆమె పడక గది పక్క నిద్రపోయింది.

కుటీరంలో గడియారం పన్నెండు కొట్టింది. గబ్బిలాయి కిందికి దిగింది.

"గది ఆ మూల ఎలక కన్నం వుంది. అది తిన్నగా నేలమాళిగలోకి దారి తీస్తుంది. నీకోసం గడ్డి మైదానంమీద చూస్తూవుంటా" అంది.

అది కప్పుమీదికి పొడుచుకు వచ్చిన కిటికీ గుండా యెగిరింది. బురతీనొ కొట్టు గది మూలకి పరిగెత్తి వెళ్లేడు. దారినిండా చిక్కులు చిక్కులుగా సాలెగూళ్లు తగిలేయి. సాలెపురుగులు ప్రళయ విపత్తు సంభవించినట్టుగా బుసకొట్టేయి. అతను నేలమాళిగలోకి వెళ్లే ఎలక కన్నం గుండా దిగేడు. అది రానురాను యిరుకైపోయింది. అతను సరిగ్గా లోపల్నుంచి దూరలేకపోయేడు. అప్పుడు హఠాత్తుగా నేల మాళిగలోకి తలకిందులుగా పడ్డాడు.

అతను వో యెలక బోనులో పడిపోయేవాడే. అప్పుడే కూజాలో పాలు తాగుతూ వున్న పసిరిక పాము తోక తొక్కేశాడు. ఓ దారి గుండా యీడ్చుకుంటూ బయటికి వెళ్లేడు. ఆ దారిని పిల్లులు వాడుకుంటాయి.

గబ్బిలాయి నీలం పువ్వుల పైన చడీచప్పుడు లేకుండా రెక్కలు ఆడిస్తోంది.

"నా వెనకేలే రా, బురతీనొ, బడుద్ధాయి దేశానికి" అంది.

గబ్బిలాయికి తోక లేదు. అందుచేత అది యెకా యెకీ యెగరలేదు, పైకీ కిందికీ పైకీ కిందికీ యెగురుతుంది. చూసేవాళ్లకి దయ్యంలాగా వుంటుంది. యెగిరేటంత సేపూ నోరు తెరుచుకునే వుంటుంది. పురుగుల్ని కటక్కన పట్టుకుని లటక్కన మింగడానికి వీలుగా అలా పెడుతుంది

సమయం వృధా చెయ్యకుండా. బురతీనొ దాని వెనక్కాలే పరిగెడుతూ వెళ్లేడు. మెడ దాకా గడ్డిలో వెళ్లేడు. తడి గడ్డి అతని బుగ్గలకి తగులుతోంది.

హఠాత్తుగా గబ్బిలాయి గుండ్రటి చంద్రుని వేపు యెగిరింది.

"యిక్కడ వున్నాడు!" అని కింద యెవర్నో ఉద్దేశించి అరిచింది.

ఆ సమయంలో బురతీనొ తల కిందులైపోయి వో యేటవాలువిూదనుంచి దొర్లుకుంటూ పడిపోయి ముళ్ల మొక్కమీద తేలాడు.

లేచి కూర్చుని కళ్లు తెరిచాడు. వొళ్లంతా గీరుకుపోయి గాయాలయేయి. నోరంతా యిసక నిండిపోయింది.

"ఆహా! మీరేనా బాబులూ?"

బురతీనొ యెదురు గుండా బాసిలో పిల్లి, అలీస నక్క వున్నాయి.

"ధైర్యం సాహసం వున్న చిన్ని బురతీనొ! చంద్రమండలంమీదనుంచి కింద పడి వుంటాడు" అంది నక్క.

"చిత్రం! యింకా బతికి వున్నాడు!" అంది పిల్లి మబ్బుగా.

తన పాత పరిచయస్థులు దొరకడం చూసి బురతీనొకి సంతోషం కలిగింది. పిల్లి కుడి పంజాకి బేండేజీ వుంది. నక్క తోక అంతా బాడవ బంద అంటుకుంది. అలా వుండడంతో బురతీనొకి అనుమానం కలిగింది.

"అంతా మన మేలుకే! యేమైనా బడుద్దాయి లోకం చేరావు" అంది నక్క.

అది వో పంజా యెత్తి యెండిపోయిన యేటిమీద వంతెనని చూపించింది. అవతలి వేపున పాత చెత్త గుట్టల పక్కన సగం శిథిలం అయిన గుడిసెలు కనిపించేయి. యెండిపోయిన కొన్ని చెట్లు కనిపించేయి. యిళ్ల శిఖరాలు వాలినట్టు కనిపించేయి.

"అక్కడ కుందేలు బొచ్చు చొక్కాలు అమ్ముతున్నారు" అని నక్క నాలిక నాక్కుంటూ అంది. "డాడీ కార్లోకి బాగుంటుంది! రంగు రంగుల పెద్ద బాలశిక్షలూ అమ్ముతున్నారు. అబ్బ! యెలాంటి ఐస్‌క్రీమ్‌లున్నాయని! పీచు మిఠాయి కూడా! నీ డబ్బు యింకా వుంది కదా బురతీనొ! వూఁ, వుంది కదూ?" అంది.

అలీస నక్క అతన్ని నుంచో పెట్టి, అతని చొక్కా తుడిచి, ఆ వంతెనమీదనుంచి తీసుకు వెళ్లింది.

బాసిలో పిల్లి మూతి ముడుచుకుని వెనక్కాలే వెళ్లింది.

అప్పటికే అర్ధరాత్రి అయింది. కాని బడుద్దాయి దేశంలో ప్రతి వాళ్లూ మెలుకువగానే వున్నారు. వుల్లల్లా వున్న కుక్కలు పల్లేరుకాయలు గుచ్చుకున్న వొళ్లతో మెలికలు తిరిగిన దుమ్ము

కొట్టుకుపోయిన వీధుల్లో తిరుగుతున్నాయి. వాటి నోళ్లు ఆకళ్లతో ఆమ్మని తెరుచుకున్నాయి.

"గుర్... ర్... ర్..."

దారి పక్క పెరిగిన దుమ్ము గడ్డిని డొక్కలు పుచ్చిపోయిన మేకలు మేస్తూ వున్నాయి. అవి బొద్దు తోకల్ని ఆడిస్తూ వున్నాయి.

"మే... మే..." అని అవి అరుస్తూ వున్నాయి.

ఓ ఆవు తల వాలేసుకుని నుంచుంది. దాని బొమికెలు డొక్కల్లోనుంచి పొడుచుకు వస్తున్నాయి.

"అంబా" అని అరుస్తోంది.

యీడ్చుకుంటూ వున్న తోకలున్న కోడిపెట్టలు అలిసిపోయి తడబడుతున్నాయి.

వీధిల కూడలుల్లో బుల్‌డాగ్ పోలీసులు అంచుల టోపీలు పెట్టుకుని, చారల పట్టీలు వేసుకుని కాపలా కాస్తున్నాయి.

"అలా వెళ్లండి! కుడి వేపు నడవండి! నడుస్తూ వుండండి!" అని ఆ పోలీసు కుక్కలు ఆకలితో, పుచ్చిపోయిన ఆ దేశ వాసుల్ని చూసి అరుస్తున్నాయి.

నక్క బురతీనొని వీధిలో ముందుకు లాక్కుపోయింది. వీధిలో బాగా బలిసిన పిల్లులు కనిపించేయి. అవి బంగారు కళ్ల అద్దాల్ని పెట్టుకున్నాయి. టోపీలు పెట్టుకున్న ఆడపిల్లుల చేతుల్లో చేతులు వేసి నడుస్తూ వెడుతున్నాయి.

నగర గవర్నరు అయిన పెద్ద కొవ్విన నక్క గాలిలోకి ముట్టె పెట్టి చాలా ఘనంగా వాలకం పెడుతూ పక్కనుంచి అలసంగా వెళ్లింది. దాని పక్కనే పొగరు మోత్తనంగా కనిపించే మహిళా నక్క యేదో పువ్వు చేత్తో పట్టుకుని వెడుతోంది.

"అలా షికారుగా వెళ్లేవాళ్లు తమ డబ్బుని అద్భుతాల పొలంలో నాటిన వాళ్లు" అని బురతీనొ చెవిలో నక్క వూదింది. "యివాళ రాత్రే అలా చేసే ఆఖరి రోజు. పొద్దున్నే డబ్బు గుట్టని పోగు చేసుకోవచ్చు, అన్ని రకాల చక్కని వస్తువుల్ని కొనుక్కోవచ్చు. కానీ గబగబా!" అంది.

నక్క, పిల్లి బురతీనొని బీడు పొలం దగ్గరికి తీసుకువెళ్లేయి. అక్కడ పగిలిన కుండలు, చిరిగిన చెప్పులు, గుడ్డ పీలికలు, చిల్లుల బూట్లు తొడుగులు చెదురు మదురుగా పడి వున్నాయి. అక్కడ నక్క, పిల్లి వొకదాని కొకటి అడ్డం వెడుతూ అతన్ని పొడుస్తూ వున్నాయి.

"గుంట తవ్వు."

"నీ కాసులు అందులో పెట్టు."

"దానిమీద ఉప్పు వెయ్యి."

"నీళ్లు పొయ్యి! బాగా పొయ్యి."

"హ్రాం, హ్రీం, హ్రైం అనడం మర్చిపోకు సుమా."

బురతీనొ సిరామరకలైన ముక్కుని గీరుకున్నాడు.

"కొంచెం వెనకగా వుండండి" అన్నాడు.

"బాగుంది! నువ్వు డబ్బు యెక్కడ దాస్తున్నావో మేం చూడద్దా యేమిటి?" అంది నక్క.

"ఆఁ, మరి! కదా?" అంది పిల్లి.

అవి కొంచెం పక్కకి వెళ్లి వో చెత్త కుప్ప వెనక నక్కేయి.

బురతీనొ వో గుంట తవ్వి నాలుగు కాసుల్నీ దాచేడు. "హ్రాం, హ్రీం, హ్రైం " అని మూడు సార్లు వల్లించేడు. గుంటని కప్పేసి జేబులోనుంచి వో పిసరు ఉప్పు తీసి చల్లేడు. చేత్తో కాసిని నీళ్ల కుంటలోనుంచి తీసి చల్లేడు. చెట్టు పెరుగుతుందని చూస్తూ కూర్చున్నాడు.



## బురతీనొని పోలీసులు అరెస్టుచెయ్యడం, తనని సమర్థించుకుంటూ వొక్క మాటా అతన్ని చెప్పనియ్యకపోవడం

బురతీనొ యెక్కడ్నో నిద్రపోతాడని అలీస నక్క అనుకుంది. కాని అతను చెత్త కుప్పమీద కూర్చుని కదల్లేదు. ముక్కు అలా పెట్టుకు కూర్చునే వున్నాడు.

అప్పుడు పిల్లి కాపలా కాయమని చెప్పి, దగ్గర్లో వున్న పోలీస్ స్టేషన్‌కి వెళ్లింది.

అక్కడ వో పొగచూరిన గదిలో సిరా వొలికిన బల్లమీద గురక పెట్టి పడుకుంది కాపలా కుక్క పోలీసు.

"యేమండోయ్, డ్యూటీ ఆఫీసరుగారూ!" అని నక్క బతిమాలుతున్నట్టుగా అంది. "మీరు చాలా బలంగా దృఢంగా వున్నారు. బయట జేబులు కొట్టే జులాయి వున్నాడు. అతన్ని అరెస్టు చెయ్యలేరూ? అందరికీ పెద్ద పీడ అయిపోయేదు, డబ్బున్న వాళ్లకి భయంగా వుంది" అంది.

"జేబు దొంగా? ఉఫ్!"

నిద్రమగతగా వున్న కాపలా పోలీసు కుక్క గట్టిగా మొరగడంతో నక్క భయపడి వొణికింది.

జేబు దొంగ బురతీనొ బీడుమీద కనిపించినట్టు అలీస నక్క వివరించి చెప్పింది.

యింకా అరుస్తూ వున్న పోలీసు కుక్క గంట మోగించింది. రెండు వేగు కుక్కలు గదిలోకి చొచ్చుకు వచ్చేయి. అవి డిటెక్టివ్‌లు. యెప్పుడూ నిద్రపోవు. యెవర్నీ నమ్మవు. వాటికి వొక దాని పట్ల యింకో దానికీ నేరస్థులేమోనన్న వూహలు వుంటాయి.



డ్యూటీలో వున్న పోలీసు కుక్క వాటిని వెళ్లి ప్రమాదకరమైన ఆ నేరస్థుని సజీవంగానైనా, చచ్చిపోయి వున్నా పట్టుకురమ్మని ఆజ్ఞాపించింది.

"వుఫ్!" అని డిటెక్టివులు వూరికే అన్నాయి.

వెంటనే బీడు దగ్గరికి దౌడు తీస్తూ పరిగెత్తేయి.

బీడు దగ్గరికి చేరే ముందు వంద అడుగులూ పొట్టలమీద పాకేయి. రెండూ వొక్క సారే బురతీనొమీద పడి చేతులు పట్టుకుని పోలీసు స్టేషన్‌కి యీడ్చుకుపోయేయి.

కాళ్లు వేలాడుతూ వుండగా బురతీనొ బతిమాలి తను యేం చేసిందీ వాటికి చెప్పేడు.

"అదంతా అక్కడ తేల్చుకుందువుగాని" అన్నాయి అవి.



నక్క, పిల్లి యే మాత్రం ఆలస్యం చెయ్యకుండా నాలుగు కాసుల్నీ యువతలకి తవ్వాయి. నక్క తనకి లాభంగా వుండేట్టు గబగబ ఆ డబ్బుని పంచెయ్యడంతో పిల్లికి వొక బంగారు కాసు వచ్చింది, నక్కకి మూడు దక్కేయి.

పిల్లి మాటా పలుకూ లేకుండా నక్క మూతిమీద గీరింది.

నక్క పిల్లిని గట్టిగా పంజాలతో పట్టుకుంది. అవి రెండూ ఆ బీటిమీద వొక దాన్ని వొకటి దొర్లించుకోవడం మొదలుపెట్టాయి. నక్క బొచ్చూ, పిల్లి బొచ్చూ వెన్నెలలో యెగరడం మొదలుపెట్టేయి.

అలా వొక దాన్ని వొకటి బాగా మర్దించుకున్నాక అవి సొమ్మని సమంగా పంచుకున్నాయి. అదే రాత్రి ఆ వూరి నుంచి మాయమైపోయేయి.

యీ లోపున ఆ డిటెక్టివ్ కుక్కలు బురతీనొని పోలీసు స్టేషన్‌కి లాక్కెళ్ళాయి.

డ్యూటీలో వున్న బుల్‌డాగ్ బల్ల వెనకనుంచి యువతలకి వూడిపడింది. బురతీనొ జేబులు వెతికింది.

వో పంచదార బిళ్ళ, కాసిని బాదం పప్పు చాకొలెట్లూ తప్ప యేమీ కనిపించలేదు. దాంతో మంటగా అది బుసకొట్టింది.

"నువ్వు మూడు నేరాలు చేశావు, త్రాష్టుడా! నీకు ఐడెంటిటీ కార్డు లేదు, యిల్లు లేదు, పని లేదు. వీణ్ణి తీసుకెళ్ళి చెరువులో ముంచండి" అంది ఆ కాపలా పోలీసు కుక్క.

"వో యస్" అన్నాయి డిటెక్టివ్ కుక్కలు.

బురతీనొ డాడీ కార్లో గురించి చెప్పబోయేడు. తన సాహసాల గురించీ చెప్పబోయేడు. కాని యేమీ లాభం లేకపోయింది. ఆ డిటెక్టివ్ కుక్కలు అతన్ని వొడిసి పట్టుకుని గబగబ లాక్కుపోయి వంతెనమీదనుంచి లోతుగా, మకిలిగా వున్న చెరువులోకి, కప్పలతో నిండుగా వున్న చెరువులోకి, జలగలూ, నీటి పురుగులూ నిండుగా వున్న చెరువులోకి తోసేశాయి.

బురతీనొ తపామని నీళ్ళల్లో పడ్డాడు. ఆకుపచ్చ నాచు అతనిమీద కమ్ముకుపోయింది.

## బురతీనొ ఆ చెరువులో వున్నవాటితో నేస్తం కట్టడం, తన నాలుగు కాసులూ పోయిన విషయం తెలుసుకోవడం, తాబేలు తర్చిల బంగారం తాళం బురతీనొకి యివ్వడం



బురతీనొ తయారైంది కొయ్యతో అన్న విషయాన్ని మర్చిపోకూడదు. అంచేత అతను మునిగిపోలేదు.

కాని అతని భయం భయంలానే వుంది కాబట్టి నీళ్ల మీద చాలా సేపు పడి వున్నాడు. అతని వొళ్లంతా నాచు కమ్మి వుంది.

ఆ చెరువులో వుండేవి అతని చుట్టూ చేరాయి. నల్లగా, ఉబ్బి వున్న చిరు కప్పలు, అవి శుద్ధ బదుద్దాయిలు. వెనక కాళ్లు తెడ్లలాగా వుండే నీటి పురుగులు, జలగలు, దేన్ని పడితే దాన్ని మింగేసే కీటకాలు. యివి వొక దాన్ని వొకటి మింగేస్తాయి కూడా, ఆఖరికి చిన్న చిన్న సూక్ష్మక్రిములు.

చిరు కప్పలు గట్టి పెదాలతో అతన్ని గిలిగింతలు పెట్టాయి. అతని టోపీ కుచ్చు కొరకడం వాటికి బాగా వున్నట్టు అనిపించింది. జలగలు అతని జేబుల్లోకి దూరేయి. వో తెడ్ల కాళ్ల పురుగు నీళ్ల పైన పొడుచుకు వచ్చిన అతని ముక్కుమీదకి యెక్కి నీళ్లల్లోకి యెగిరిగెంతుతూ ఆడుకుంది.

కొంచెం సేపయేటప్పటికి బురతీనొకి విసుగొచ్చింది. అతను నీళ్లల్లో కాళ్లు జాడించుకున్నాడు.

"ఛవ్! పొండి! నేనేమిటనుకున్నారు? చచ్చిన పిల్లి ననుకున్నారా?"

చెరువు కాపరస్థులు అతన్ని వదిలేసి పోయేయి. బురతీనొ బోర్లా పడుకుని యీదుకుపోయేడు.

కలువ ఆకులమీద పెద్ద నోరున్న కప్పలు అతనికేసి గుడ్లప్పగించి చూస్తూ కుర్చున్నాయి.

"యేదన్నా చేప యీదుతోందేమో" అంది వొక కప్ప.

"దాని ముక్కు చూడు, కొంగ ముక్కులాగా" అంది యింకోటి.

బురతీనొ ఆయాసం తీర్చుకోవడానికి పెద్ద కలువ ఆకుమీదకి యెక్కేడు. అతను గట్టిగా మోకాళ్లని పట్టి దానిమీద కూర్చున్నాడు.





"ప్రతి చిన్న పిల్లాడికీ, చిన్న పిల్లకీ కమ్మగా కడుపునిండా పాలు తాగి వెచ్చగా పడుకునే యోగం వుంటుంది" అని వజవజ పళ్లు వొణుకుతూ వుండగా అన్నాడు. "తడి ఆకు మీద కూర్చున్న నిర్భాగ్యుణ్ణి నే వొఖ్ఖణ్ణే... అబ్బ! కప్పలూ! కాస్తేమన్నా పడెయ్యండర్రా తిండానికి!" అన్నాడు.

కప్పల సంగతి ప్రతి వాళ్లకీ తెలుసుగా. వాటి రక్తం చల్లగా వుంటుంది. అలా అని వాటికి గుండె లేదనుకోకూడదు. పళ్లు వజవజ వొణుకుతూ బురతీనొ తన కష్టాలు చెపుతూ వుంటే అవి వొక్కొక్కటే యెగిరి గెంతి, వెనక కాళ్లతో ముందుకు తోసుకువస్తూ, నీటి చెరువు అడుగుకంటా పోయేయి. అవి వో పురుగు కళేబరాన్ని, వో తూనీగ రెక్కనీ, కొంచెం బందనీ, చేప ముక్కనీ, చీకిన దుంపలనీ తెచ్చాయి.

ఆ తిను బండారాలనన్నిట్నీ అవి బురతీనొ ముందు పెట్టి, మళ్లీ కలువ ఆకులమీదకి యెగిరి పోయేయి. అక్కడ కదులూ మెదులూ లేకుండా రాళ్లల్లా కూచుండిపోయేయి.

బురతీనొ కప్పల విందు వాసన చూసి, రుచి చూశేడు.

"అబ్బ! కడుపులో దేవుతోంది! యెంత ఘోరంగా వున్న వాటిని తెచ్చాయి!" అన్నాడు.

దాంతో వొక్క సారి కప్పలన్నీ మళ్లీ నీళ్లల్లోకి దూకేయి.

ఆకుపచ్చ నాచు చెరువుమీద అల్లల్లాడింది. భయం కలిగించే పెద్ద పాము తలకాయలాంటిది పైకి కనిపించింది. అది బురతీనొ కూర్చున్న చోటికి యిదుకుంటూ వచ్చింది.

బురతీనొ టోపీ కుచ్చు లేచింది. అతనికి విపరీతమైన భయం వేసేసింది. దాదాపు నీళ్లల్లోకి దొర్లి పడిపోయినంత పనైంది. తీరా చూస్తే అది పాము కాదు. శుద్ధ నిరపాయకరమైనది వయసు మళ్లిన తాబేలు. దాని పేరు తర్చిల. దాని కళ్లు బాగా కనిపించవు.

"ఓరి తెలివితక్కువ కుర్రాడా! నీకసలు బుర్రలేదు. నువ్వు యింటి దగ్గర వుండాల్సిన వాడివి, మంచి పిల్లాడిలా పాఠాలు చదువుకుంటూ... అలా కాకుండా బదుద్దాయి దేశానికి వచ్చేవు" అంది.

"నిజమే ననుకో, కాని డాడీ కార్లోకి మరి కాసిని బంగారు నాణేలు సంపాదించాలనుకున్నాను. నేను బుద్ధిమంతుణ్ణి, మంచి కుర్రాణ్ణి."

"నక్క, పిల్లి నీ డబ్బు వొడుక్కు పోయేయి. అవి యీ చెరువు పక్కనుంచే పారిపోతూ దాహం అయి నీళ్ల తాగడానికి ఆగేయి. నీ డబ్బుని తవ్వేసి యెలా దాని గురించి పోట్లాడుకున్నాయో బడాయిగా చెప్పుకుంటూ వుంటే విన్నాను. ఓరి తెలివితక్కువ దద్దమ్మా! అసలు నీకు బుర్ర లేదు!" అంది.

"నన్ను తిట్టక్కర్లేదులే! యిలాంటప్పుడే యెవళ్లకేనా సాయం కావాలి! యిప్పుడు నన్నేం చెయ్యమంటావ్ చెప్పు! అయ్యో, అయ్యో! యేం జరిగింది! నేను డాడీ కార్లో దగ్గరికి యెలా వెళ్లను? అయ్యో! అయ్యో!" అని బురతీనొ గొణిగేడు.

పిడికిళ్ళు కళ్లమీద పెట్టుకుని యెంతో జాలి కలిగేటట్టు యేడిచాడు. వున్నట్టుండి కప్పలన్నీ వొక్క పెట్టున అయ్యో అని జాలి పడ్డాయి.

"యిదిగో తర్చిల! అతనికి సాయం చెయ్యి!" అన్నాయి.

తాబేలు చంద్రుడికేసి కాసేపు చూసి దేన్నో గుర్తు తెచ్చుకుంది.

"పూర్వం వో సారి నేను వొకరికి సాయం చేశాను. కాని తర్వాత అతను చక్కా పోయి మా తాతనీ, మామ్మనీ తాబేలు చిప్ప దువ్వెనలు చేసుకున్నాడు" అంది తాబేలు. మళ్లీ చాలా సేపు చంద్రునికేసి చూసింది. "సరే, యేం చెప్పు నువ్వు, నాయనా. యిక్కడ కూర్చో. నేను నీటి అడుగుకి వెళ్లివస్తా. నీకేదన్నా లాభించేది కనిపిస్తుందేమో చూస్తాను" అంది.



అది పాము తలలాంటి తల ముడుచుకుని మెల్లిగా నీటి అడుగుకు దిగింది.

"తర్చిల తాబేలుకి యేదో పెద్ద రహస్యమే వుంది" అన్నాయి కప్పలు మెల్లిగా.

చాలా సేపు గడిచింది. చంద్రాస్తమయం అవుతోంది.

ఆకుపచ్చ నాచు కదిలింది. తాబేలు ప్రత్యక్షం అయింది. దాని నోట్లో బంగారు తాళం వుంది.

అది దాన్ని బురతీనొ కాళ్ల దగ్గర కలువాకుమీద పెట్టింది.

"యిదిగో, అమాయకుడా! యెవర్ని పడితే వాళ్లని నమ్మేసే వెర్రిబాగులవాడా! యిక పైన నీ బంగారు నాణేలు కాజేసిన నక్క అన్నా, పిల్లి అన్నా భయపడకు. నీకు యీ చిన్ని తాళాన్ని యిస్తున్నాను.

దీన్ని బారు గడ్డం మనిషికాయన నీళ్లల్లో పారేసుకున్నాడు. అతని గడ్డం యెంత బారుగా వుండే దంటే దాన్ని జేబులో దోపుకునేవాడు, తనకి అడ్డం రాకుండా వుంటుందని. యీ తాళం వెతికి పెట్ట మని నన్ను యెంత బతిమలాడేడో అతను!'' అంది తాబేలు.

తాబేలు నిట్టూర్చింది. కొంచెం సేపు యేమీ మాట్లాడలేదు. తర్వాత మళ్లీ గాఢంగా నిట్టూ ర్చింది. దాంతో చిన్న చిన్న నీటి బుడగలు నీటి పైన తేలాయి.

''కాని నేనతనికి సాయం చెయ్యలేదు. అప్పట్లో నాకు మనుషులంటే చాలా చాలా కోపంగా వుండేది. మా తాబేలు తాతనీ, మామ్మనీ చంపి, వాటి చిప్పల దువ్వెనలని చేసుకున్నందుకు. యీ తాళం గురించి ఆ గడ్డం వాడు చాలా చాలా చెప్పేడు. కాని యేమిటో మర్చేపోయేను. నాకు వొక్కటే గుర్తుంది. దీంతో యేదన్నా తలుపు తెరిస్తే గనక, అక్కడనుంచి నీకు యెంతో ఆనందం వస్తుంది'' అని చెప్పింది తాబేలు.

బురతీనొ గుండె ధనధన కొట్టుకుంది. అతని కష్టాలన్నీ తక్షణం మరుగున పడిపోయేయి. అతను జేబులోనుంచి జలగల్ని తీసి పారేసి చిన్న తాళాన్ని లోపల పెట్టుకున్నాడు. తర్చిల తాబేలుకి కృత జ్ఞతలు చెప్పి, కప్పల దగ్గర గౌరవంగా వీడ్కోలు తీసుకుని నీళ్లల్లోకి దూకి వొడ్డుకు యీదుకుపోయేడు.

''బురతీనా! జాగ్రత్త! తాళం పారేసుకోకు!'' అని కప్పలు బెకబెక లాడేయి. అతను అవతలి వొడ్డున నల్లని నీడలా కనిపించగానే గట్టిగా గొంతుకలు చించుకుంటూ అలా హెచ్చరించేయి.



# బడుద్ధాయి దేశంనుంచి బురతీనొ పారిపోవడం, వో మిత్రుణ్ణి కలుసుకోవడం

బడుద్ధాయి దేశంనుంచి యెలా బయటపడాలో బురతీనొకి తర్చిల తాజేలు చెప్పలేదు.

అతను ముక్కుకు సూటిగా పరిగెత్తిపోతూనే వున్నాడు.

హఠాత్తుగా బూడిద రంగు బంతిలాంటిది అతని ముందు కనిపించింది. వెంఠనే కుక్కల మొరుగు వినిపించింది. బురతీనొ వో బండ రాతికి తానుకుపోయేడు. బడుద్ధాయి దేశపు పోలీసు కుక్కలు రెండు అతని పక్కనుంచే భీకరంగా బుసలు కొడుతూ పరిగెత్తిపోయేయి. ఆ బూడిద రంగు బంతి కోసుగా రోడ్డుమీద దొర్లిపోయింది. పోలీసు కుక్కలూ దాని వెనకాలే పోయేయి.

పంజాల చప్పుడు, కుక్కల మొరుగూ తగ్గేక బురతీనొ పరుగు లంకించుకున్నాడు. అతను గబ గబ వేగంగా పరిగెడుతూ వుంటే నల్లని చెట్లు పక్కనుంచి నక్షత్రాలు దూసుకుపోతునట్టు వుంది.

వున్నట్టుండి ఆ బూడిదరంగు బంతి దారిలో లేచింది. అది యేమిటైందీ బురతీనొ పోల్చి పట్టేడు. కుందేలు. దానిమీద అటూ యిటూ కాళ్లు వేసి దాని చెవులు పట్టుకుని వో పాలిన ముఖం వాడు కూర్చున్నాడు.

పైనుంచి రాళ్లు కిందికి జారేయి. పోలీసు కుక్కలు కుందేలు వెనకాలే దౌడు తీశాయి. మళ్లీ చుట్టూతా అంతా నిశ్శబ్దంగా వుంది. యీసారి బురతీనొ యెంతో వేగంగా పరిగెత్తేడు. నక్షత్రాలు, చెట్లు పిచ్చిపట్టి సుళ్లు తిరిగినట్టుగా తిరిగిపోయేయి.

మూడో సారి బూడిదరంగు కుందేలు రోడ్డుమీద గెంతింది. ఆ చిన్న వాడు వో కొమ్మకి కొట్టు కుని వెనక్కి పడ్డాడు. ధనామని కింద నేలమీద బురతీనొ కాళ్ల దగ్గర పడ్డాడు.

''హేయ్! పట్టోండి'' అని పోలీసు కుక్కలు కుందేలు వెనక బడ్డాయి. వాటి కళ్లు విద్వేషంతో నిండిపోయేయి. అంచేత బురతీనొని గాని, ఆ చిన్న వాణ్ణి గాని గమనించలేదు.

''సెలవ్, మల్వీనా, సెలవ్!'' అని ఆ చిన్న వాడు యేడుస్తూ కీచుమన్నాడు.

బురతీనొ అతనిమీదకి వొంగి చూద్దుడు కదా ప్యెరో. పొడుగాటి చేతుల తెల్ల చొక్కా తొడు క్కున్నాడు.

అతను తల బండి చక్రం బాటలో దూర్చి వాలి వున్నాడు. తన ప్రాణం పోయిందనే అతను అర్థంపర్థంలేని మాటలు మూలుగుతున్నాడు. ''సెలవ్, మల్వీనా, సెలవ్'' అని తుది ఘడియలు వచ్చినట్టు అన్నాడు.

బురతీనొ అతన్ని కుదపడం మొదలుపెట్టేడు. కాలు లాగేడు. ప్యెరోలో చలనం కనిపించ లేదు. అప్పుడు బురతీనొ తన జేబులో వుండిపోయిన జలగని పట్టుకుని ఆ ప్రాణంలేని చిన్న జీవి ముక్కు దగ్గర తగిలించేడు.

ఆ జలగ యిక గొడవలేకుండా అతని ముక్కు కరచి పట్టుకుంది. ప్యెరో ఠక్కున లేచి కూర్చు న్నాడు. తల ఆడించి, దాన్ని పీకి పారేశాడు.

"అయితే నాకు యింకా ప్రాణం వుందన్న మాట!" అని మూలిగేడు.

అతని బుగ్గలు ముగ్గులాగా తెల్లబడిపోయేయి. బురతీనొ అతని బుగ్గలు పట్టుకుని ముద్దు పెట్టుకున్నాడు.

"యిక్కడికి యెలా వచ్చేవు? బూడిదరంగు కుందేలుమీద స్వారీ చేస్తున్నావేమిటి?" అని అడిగేడు.

ప్యెరో భయం భయంగా చుట్టూతా చూశేడు.

"బురతీనొ, బురతీనొ! గబగబా యెక్కడేనా దాంకో. ఆ కుక్కలు బూడిదరంగు కుందేల్ని వెంటాడ్డం లేదు తెలుసా — అవి నా వెనక బడ్డాయి. శ్రీమాన్ కరబాస్ బరబాస్ రాత్రీ పగలూ నన్ను వెంటాడుతూనే వున్నాడు. అతను బడుద్ధాయి నగరంలో పోలీసు కుక్కల్ని డబ్బిచ్చి పుర మాయించి నన్ను చచ్చినా బతికినా పట్టుకొమ్మని ఆదేశించేడు" అని చెప్పాడు.

దూరంలో కుక్కల మొరుగు మళ్లీ వినిపించింది. బురతీనొ ప్యెరో చొక్కా చేతిని పట్టుకుని వో గుబురులోకి లాగేశాడు. ఆ గుబురుమీద సువాసనలు చిమ్మే చిన్న బంగారు రంగు పువ్వులు వున్నాయి.

అక్కడ పుచ్చు ఆకులమీద వాలి ప్యెరో తన కథ మొదలుపెట్టేడు.

"యేం జరిగిందంటే బురతీనొ" అని మొదలుపెట్టాడు. "ఓ రాత్రి పూట గాలి హోరుగా వుంది. వాన మొత్తేస్తోంది..."



# తను కుందేలుమీద యెక్కి బడుద్ధాయి దేశం చేరడం గురించి పైరో చెప్పడం

"యేం జరిగిందంటే బురతీనొ. ఓ రాత్రి పూట గాలి హోరుగా వుంది. వాన మొత్తేస్తోంది. శ్రీమాన్ కరబాస్ బరబాస్ పైపు కాలుస్తూ నెగడు పక్క కూర్చున్నాడు. కీలుబొమ్మలన్నీ నిద్ర పోతున్నాయి. నేనొక్కణ్ణే మెలుకువగా వున్నాను. నీలం జుట్టు అమ్మాయి గుర్తు వచ్చింది –"

"ఆమె గుర్తు వచ్చిందీ! పాడు పిల్ల!" అని అడ్డం వెళ్లేడు బురతీనొ. "నేను నిన్న సాయంత్రమే ఆమెని తప్పించుకుని పారిపోయేను."

"యేమిటీ? నువ్వామెని చూశావా? నా మల్వీనాని చూశావా?"

"హుఫ్! చూడకపోవడమేమిటి? యేడుపుగొట్టు పిల్ల, నా ప్రాణం తోడేసింది –"

పైరో గెంతి, చేతులు బార్లా చాపేసుకున్నాడు.

"నన్ను ఆమె దగ్గరికి తీసుకెళ్లు. నన్ను ఆమె దగ్గరికి తీసికెడితే బంగారు తాళం రహస్యం నీకు చెప్తాను" అన్నాడు.

"యేమిటీ!" అని బురతీనొ సంతోషంతో అరిచేడు. "నీకు బంగారు తాళం రహస్యం తెలుసా?" అని అడిగేడు.

"అదెక్కడుందో, యెలా సంపాదించాలో నాకు తెలుసు. దానితో తెరవవలసిన చిన్న తలుపు యేదో కూడా నాకు తెలుసు. నేనా రహస్యం పొంచివిన్నా. అందుకనే శ్రీమాన్ కరబాస్ బరబాస్ పోలీసు కుక్కలతో నా వెంటబడ్డాడు."

ఆ మాయా తాళం తన దగ్గర వుందని చెప్పాలని బురతీనొకి మహా కుతూహలంగా వుంది. ఆ రహస్యం నోరు జారకుండా వుండేందుగ్గాను టోపీని తీసేసి నోట్లో కుక్కుకున్నాడు.

మల్వీనా దగ్గరికి తీసికెళ్లమని పైరో వేడుకున్నాడు. యెంత మూర్ఖుడు, వొక్కొక్క పాయింటే చెపుతూ బురతీనొ అప్పుడు చీకటి అనీ, ప్రమాదం అనీ వేళ్లు మడుస్తూ వివరించడం మొదలెట్టేడు. కాని తెల్లవారుతూనే ఆ అమ్మాయి దగ్గరికి వెడదామన్నాడు.

మళ్లీ పైరోని గుబురు వెనక దాంకోమని చెప్పేడు.

"నీ... క... గ... థ... సెప్పు..." అని బురతీనొ నోట్లో టోపీతో నత్తి చెప్పేడు.

"యేం, రాత్రి, గాలి హోరుగా వుంది..."

"ఆ... వి... సయం... సెప్పే... వు."

"సరే అయితే. నేను మెలుకువగా వున్నాను కదూ? హఠాత్తుగా నాకు చప్పుడు వినిపించింది.

యెవళ్లో కిటికీమీద తట్టేరు'' అని ప్యెరో చెప్పేడు.

'' 'యెవరది అర్ధరాత్రి అంకమ్మ శివాలు!' అని శ్రీమాన్ కరబాస్ బరబాస్ గర్జించేడు.

'' 'నేనండయ్యగోరూ, వైద్యం కోసం జలగలు అమ్మేటోణ్ణి' అని కిటికీ దగ్గర్నుంచి జవాబు వచ్చింది. 'మీ నెగడు కాడ చలి కాగనిండయ్యా' అని ఆ గొంతుక చెప్పింది.

''సరే నాకూ కుతూహలంగా వుంది వైద్యం కోసం జలగలు అమ్మేవాళ్లు యెలా వుంటారో చూడాలని. నేను మెల్లిగా వో వార తెరని కొంచెం తొలిగించి తల గదిలోకి పెట్టాను.

''శ్రీమాన్ కరబాస్ బరబాస్ కుర్చీలోనుంచి లేచేడు. యెప్పటిలాగా, గడ్డం తొక్కుకున్నాడు. గట్టిగా తిట్టేడు, తలుపు తెరిచేడు.

''వో సన్నని పొడుగాటి మనిషి లోపలికి వచ్చేడు. మొత్తం తడిసి ముద్దయిపోయి వున్నాడు. అతని ముఖం బుల్లి బుల్లిగా వుంది. ముడతలు పడిపోయి వుంది. అతను ఆకుపచ్చ ఓవరు కోటు తొడుక్కున్నాడు. అతని పటకా దగ్గర, చాకులూ, కొక్కేలూ, పొడుగాటి సూదులూ వేలాడుతున్నాయి. అతని చేతిలో వో సీనారేకు డబ్బా వుంది, వల వుంది.

'' 'మీకు కడుపు నొప్పి యేమన్నా వొస్తే' అని నడుం దగ్గర విరిగినట్టుగా వొంగి అన్నాడు. 'తల పగిలే నొప్పి వచ్చినా, లేక చెవులు హోరు యెత్తినా అరడజను భేష్హైన జలగల్ని చెవి దగ్గర...'



'' 'నిన్ను తగలేసిరి! చాలు నోర్మూయ్యి! నీ జలగలు గిలగలు అక్కర్లేదు నాకు' అని కరబాస్ బరబాస్ గర్జించేడు. 'నీ యిష్టం వొచ్చినంత సేపు యిక్కడ చలికాగు' అన్నాడు.

''అతను వీపు నెగడుకేసి పెట్టి నుంచున్నాడు.

''అతని ఆకుపచ్చ ఓవరు కోటు తక్షణం ఆవిర్లు చిమ్మడం మొదలుపెట్టింది. యేదో బంద వాసన కొట్టింది.

'' 'జలగల వ్యాపారం బాగా లేదు' అని అతను చెప్పసాగేడు. 'వో చద్ది పంది మాంసం ముక్క కోసం, వో గళాసు సారా కోసం నా దగ్గరున్న ఆరు మంచి జలగల్ని వైద్యం కోసం మీకు కరిపిస్తా. మీకు యేమన్నా బొప్పిలూ గిప్పిలూ వుంటే — '

'' 'అబ్బబ్బ! సోది తగలెయ్య! నీ జలగలూ గిలగలూ నాకు వొద్దయ్యా బాబూ! కావాలంటే కాస్త పంది మాంసం మింగు, వో గ్లాసు సారా తగు' అరిచేడు కరబాస్ బరబాస్.

"అతను పంది మాంసం తినడం మొదలుపెట్టేడు. అతని ముఖం ముడతలు పడిపోయింది, సాగింది. సారా తాగేక వో పట్టు పొడం పిసరు యిమ్మని అడిగేడు.

" 'అయ్యా! తమ దయవల్ల యింత తిన్నాను, చలి కాగేను. మీ రుణం వుంచుకోను. మీకో రహస్యం చెప్తా' అన్నాడు.

"కరబాస్ బరబాస్ పైపు పీల్చేడు.

" 'లోకంలో నేను తెలుసుకోవాల్సిన రహస్యం వొక్కటే వుంది. యిక మిగిలిందంతా గడ్డి పరక' అన్నాడు శ్రీమాన్

" 'అయ్యా! నాకు తర్చిల తాబేలు చెప్పింది ఆ రహస్యం' అన్నాడతను.

"కరబాస్ బరబాస్ యీ ముక్క విని కళ్లు తేల వేసినంత పని చేశాడు. అతను యెగిరిగెంతేడు. గడ్డంమీద అదుగేశాడు. జలగల వైద్యుడి దగ్గరికి దూసుకుంటూ పరిగెత్తేడు, అతను భయ పడిపోయేడు.

" 'జలగల వైద్యుడూ!' అని అతన్ని గట్టిగా వాటేసుకుని యెద్దులాగా రంకె వేశాడు. 'జలగల వైద్యుడూ! వజ్రంలాంటి మనిషివి నువ్వు! చెప్పు! చెప్పు! తర్చిల నీతో యేం చెప్పిందో నాకు చెప్పు!' అన్నాడు.

"జలగల వైద్యుడు చెప్పేడు.

" 'బడుద్దాయి నగరం దగ్గర వో మురికి చెరువులో జలగల్ని పట్టుకుంటున్నాను. రోజుకి నాలుగర్ధణాలకి వో దిక్కుమాలినవాణ్ణి కూలీకి పెట్టుకున్నాను. అతను బట్టలు విప్పుకుని చెరువులోకి మెడ లోతు దిగినుంచునేవాడు. జలగలు వచ్చి అతన్ని పట్టుకునేవి.

" 'అప్పుడతను వొడ్డుకి వచ్చేవాడు. నేనతని వొంటి మీదనుంచి జలగల్ని తీసేసేవాణ్ణి.



"'ఆ రకంగా కావాల్సినన్ని జలగల్ని పట్టుకున్నాం. అప్పుడు నీళ్లల్లోనుంచి వో పాము తల బయటికి వచ్చింది.

"'చూడు జలగల వైద్యుడు, నువ్వు మా చెరువులో వుండేవాటిని బెదిరేశావు. నీరంతా మురికి చేశావు. మధ్యాహ్నం నిద్రలేకుండా చేశావు. యెప్పుడాపుతావు యీ అల్లరంతా?' అని అడిగింది.

"'అది యేదో సాదా తాబేలు అనుకున్నాను. అంచేత నేను పిసరు కూడా బెదరలేదు.

"'నీ చెరువులో వున్న జలగలనన్నిట్నీ పట్టుకునే దాకా' అన్నాను.

"'నీకు కప్పం చెల్లిస్తాను, మా చెరువు వదిలేసి యిక్కడికి రాకుండా వుంటే' అంది.

"'నీళ్లల్లో నానే మొద్దూ' అని వెటకారం చేశాను. 'చవట తర్చిల పెద్దమ్మా! నన్ను కొంటా నంటావ్! దేంతో కొనగలవు? నీ వీపుమీద పెంకుతో కాదు కదా? దాంతో దువ్వెనలు చేసుకుని అమ్ముకుంటా —'

"'ఆ తాబేలు ముఖం మాడిపోయింది.

"'మా చెరువు అడుగున' అని యేడుపు మొహం పెట్టి చెప్పింది. 'వో తాళం వుంది. దాన్ని సంపాదించడం కోసం లోకంలో యేమన్నా చెయ్యగల మనిషి వున్నాడు, అతను నాకు తెలుసు' అంది.

"జలగల వైద్యుడు యీ ముక్క అన్నాడో లేదో కరబాస్ బరబాస్ గట్టిగా 'హేయ్' అని అరిచేడు.

"'నేనే ఆ మనిషిని! నేనే! నేనే! జలగల వైద్యుడు! అబ్బ! యెందుకు నువ్వు ఆ తాళం సంపాదించి తేలేదూ?' అన్నాడు.

"'అది నిజంగా మంచి పని' అన్నాడు వైద్యుడు. అతని ముఖం అంతా ముడతలు పడిపోయింది. వూరేసిన పుట్టగొడుగులా వుంది. 'అది నిజంగా మంచి పని. నా వొకటోరకం జలగల్ని బంగారు తాళం కోసం యిస్తాను. సరే క్లుప్తంగా ముగించాలి అంటే తాబేలూ నేనూ వొకళ్లనొకళ్లు శాపనార్థాలు పెట్టుకుంటూ కూర్చున్నాం.

"'సరే యిప్పుడు చెప్తున్నా చూడు తిరుగులేదు' అని అది కాలు పైకి యెత్తి అంది. 'నీకు గాని మరెవళ్లకి గాని యీ మంత్ర తాళం దొరకదు. యీ కుంటలో వుండేవన్నీ నా దగ్గరికి వొచ్చి అడిగేటట్టు చేసిన వాడికే యిది దక్కుతుంది' అంది.

"'వొక్క క్షణం ఆలస్యం చెయ్యకూడదు!' అని అప్పుడు కరబాస్ బరబాస్ అరిచేడు. 'నేను బదుద్దాయి దేశానికి ఆఘ మేఘాలమీద అక్కడికి వెళ్లిపోతాను' అన్నాడు. హడావుడిగా గడ్డాన్ని జేబులో దోపుకుని టోపీ అందుకుని లాంతరు పుచ్చుకున్నాడు. 'నేను చెరువు వొడ్డున కూర్చుని బతిమాలుతూ నవ్వుతాను. తాబేలుని అడగమని బోదురు కప్పల్ని, చిరు కప్పల్ని, నీటి పురుగుల్ని ప్రాధేయపడతాను. వొకొక్క దానికే పీటబలిసిన యీగల్ని లక్షలు లక్షలు యిస్తానని చెప్తాను. దిక్కూ దివాణం

లేని ఆవులా అరుస్తూ. దెబ్బ తగిలిన కోడిపెట్టలాగా రోదిస్తూ. మొసలిలాగా యేడుస్తూ. అన్నిటికంటే చిన్నగా వున్న కప్పని కూడా వేడుకుంటూ. నాకా తాళం కావాలి! దాన్ని తీసుకుని బస్తీకి వెడతా. వో యింటికి వెళ్ళి మెట్లకింద వున్న గదిలోకి వెడతా. ఆ చిన్న తలుపు యెక్కడుందో వెతుకుతా. ప్రతి వాళ్ళూ ఆటు వెడతారుగాని యెవళ్ళూ దాన్ని గమనించరు. యీ తాళం చెవి పెట్టి —'

''యేం, అప్పుడేం చేశాడో తెలుసా'' అని ప్యెరో గుబురు దగ్గర పుచ్చు ఆకులమీద కూర్చుని చెప్పసాగేడు. ''నాకు యీ విషయం యేమిటో చూడాలనిపించింది. తెర వెనకనుంచి యివతలకి వచ్చేను.

''శ్రీమాన్ కరబాస్ బరబాస్ నన్ను పసికట్టేడు.

'' 'ఒరి దుష్టుడా! నువ్వు నక్కి నక్కి గోడ చాటునుంచి వింటున్నావూ?' అని చెప్పి నామీదకి వురికేడు. నన్ను పొయ్యిలో పడేద్దామని చూశాడు. కాని గడ్డం అడ్డం పడి చిక్కుకుపోయేడు. తపామని కుర్చీలమీద పడి వాటిని దొర్లిస్తూ గుడ్లు తేలేసి పడిపోయేడు.

''నేను యెలా బయట పడ్డానో నాకు తెలీదు కాని కిటికీ యివతల వూడి పడ్డాను. పొదల్లోనుంచి పాకి యివతల పడ్డాను. చీకట్లో గాలి హోరుగా వుంది. వాన మొహంమీద మోదుతోంది.

''పైన నల్లని మేఘం మెరుపు మెరిసి కనిపించింది. శ్రీమాన్ కరబాస్ బరబాస్, జలగల వైద్యుడు కలిసి నన్ను తరుముకు రావడం నాకు కనిపించింది. వాళ్ళు నాకు పది అడుగుల దూరంలో వున్నారు. 'మన పని గోవిందా' అనిపించింది నాకు. నేనప్పుడు తొట్రుపడిపోయేను. యేదోమెత్తగా వెచ్చగా తగిలింది. యెవళ్ళవో చెవులు తగిలాయి. వాటిని గట్టిగా పట్టేసుకున్నాను.

''అదే యీ బూడిదరంగు కుందేలు. అది 'అమ్మబాబోయ్' అని అరిచింది. గాలిలో యెగిరి గెంతింది. కాని నేను దాని చెవుల్ని గట్టిగా పట్టుకుని వదల్లేదు. అలా పొలాలమీదా, ద్రాక్ష తోటల మీదా దౌడు తీస్తూ వచ్చేం.' కుందేలు ఆయాసపడి అలసిపోయి కూలబడింది, కష్ట పెట్టుకుంటున్నట్టు పెదవి నాక్కుంది. అప్పుడు నేను దాన్ని నుదుటిమీద ముద్దుపెట్టుకున్నాను.

'' 'బాబ్బాబు నీకు పుణ్యం వుంటుంది, కొంచెం ముందుకు వెడదాం, కుందేలూ!'

''కుందేలు నిట్టూర్చింది. మేం మళ్ళీ బయల్దేరేం. యెక్కడికో యేమిటో కుడి వేపు యెడం వేపు తిరుగుతూ పోయేం. మేఘాలు విడి చంద్రుడు ఉదయించగానే నాకు ఓ గుట్ట కింద వో వూరు కనిపించింది. యిళ్ళ శిఖరాలు వాలి వున్నాయి.

''ఆ వూరికి వెళ్ళే రోడ్డుమీద కరబాస్ బరబాస్, జలగల వైద్యుడు పరిగెడుతున్నారు.

'' 'అయ్యో! నా అదృష్టం అంతే! వాళ్ళు బదుద్దాయి దేశానికి వెడుతున్నారు. పోలీసు కుక్కల్ని కూలికి కుదుర్చుకుంటారు. మనకి దగ్గర పడింది' అంది.

''కుందేలు జావగారిపోయింది. అది పంజాలు మధ్య ముట్టె పెట్టుకుంది. దాని చెవులు వాలి

పోయేయి. ''నేను దాన్ని బతిమలాడేను, యేడ్చి మొత్తుకున్నాను. కాళ్లమీద పడ్డాకూడా. కాని అది బెసగలేదు.

''కాని కాళ్లమీద నల్ల పట్టీలు వున్న రెండు బుల్‌డాగ్‌లూ పిక్కబలం కొద్దీ వూళ్లోనుంచి వస్తూంటే కుందేలు గజగజ వొణికిపోయింది. దాని వీపుమీదకి యెగిరి పుంజాలు తెంపుకుని పరిగెత్తే వ్యవధి వుందంతే నాకు.

''యిక తరవాత కథ నీకు తెలిసిందే.''

ఆ రకంగా ప్యెరో తన కథ చెప్పేడు.

''యేదీ ఆ యిల్లు, మెట్ల కింద ఆ గది, చిన్న తలుపు యెక్కడ?'' అని బురతీనొ తెలియనట్టు అడిగేడు.

''కరబాస్ బరబాస్ అంత వరకూ వెడితేకద! అయినా అది మనకెందుకు? తాళం చెరువు అడుగున వుంది. అది మనకి దొరికినప్పటి మాట కదా!''

''దొరకదంటావూ?'' అని బురతీనొ అతని చెవిలో గీమని అరిచేడు. తన జేబులోనుంచి తాళం తీసి ప్యెరో ముక్కు ముందు తిప్పేడు. ''యిదిగో!'' అన్నాడు.



# ప్యెరో, బురతీనోలు మల్వీనా కుటీరం చేరడం, కాని వెంటనే మల్వీనానీ, కుక్క ఆర్తెమాన్‌నీ తీసుకుని పారిపోవడం

ఎగుడు దిగుడు శిఖరాల పర్వత శ్రేణి వెనక సూర్యుడు ఉదయించగానే బురతీనో ప్యెరోలు పొదల వెనకనుంచి బయటికి పాకి వచ్చేరు. అంతకు ముందు రోజు రాత్రి నీలం జుట్టు అమ్మాయి యింటి దగ్గర్నుంచి బదుద్దాయి దేశానికి గబ్బిలాయి బురతీనోని తీసుకు వచ్చిన దారి పట్టుకు బయల్దేరారు.

గబగబా మల్వీనాని చూడాలని తొందరపడి నడుస్తూ వున్న ప్యెరోని చూస్తే నవ్వొచ్చే స్తుంది.

"యిదిగో, బురతీనో, నన్ను చూసి సంతోష పడుతుందంటావా?" అని ప్రతి పదిహేను క్షణాలకీ అడుగుతూనే వున్నాడు.

"నాకెలా తెలుస్తుంది?"

"బురతీనో, ఆమె నన్ను చూసి సంతోష పడకపోతేనో?" అని ప్రతి పదిహేను క్షణాలకీ అడుగుతూనే వున్నాడు.

"నాకేమిటి సంబంధం?"

ఆఖరికి వాళ్లకి సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు తలుపులమీద బొమ్మలు గీసిన తెల్ల కుటీరం కనిపించింది.

నీలం రంగు జుట్టు చిన్న అమ్మాయి దగ్గరికి వెళ్ళ బుద్ధి పుట్టలేదు బురతీనోకి. కాని అతనికి ఆకలిగా వుంది. అల్లంత దూరంలో వుండగానే కాగే పాల వాసన అతనికి తగిలింది.

"యీ యింటావిడ మళ్లీ చదువూ చట్టు బండలూ మొదలెడుతుందేమో. కాసిని పాలు తాగుదాం, కాని చచ్చినా అక్కడ వుండన్నేను" అన్నాడు బురతీనో.

ఆ సమయంలో మల్వీనా కుటీరం లోపల్నుంచి యివతలకి వచ్చింది. ఒక చేత్తో పింగాణీ కాఫీ జగ్గు పట్టుకుంటుంది. రెండో చేతిలో తినుబండారాలు వున్నాయి.

ఆమె కళ్లమీద కన్నీటి చారికలు మాయలేదు. ఎలకలు బురతీనోని కొట్టు గదిలో మింగేశాయని ఆమెకి గట్టిగా అనిపించింది.

ఆమె ఇసిక దారిమీద బొమ్మ బల్ల పక్కన కూర్చుంది. అక్కడ నీలం పువ్వులు పూగుతున్నాయి.

సీతాకోకచిలుకలు యెగురుతున్నాయి. అవి తెల్లని ఆకుల్లాగా, పసుపుపచ్చ ఆకుల్లాగా వున్నాయి. అప్పుడు బురతీనొ, ప్యెరోలు ప్రత్యక్షమయ్యేరు.

మల్వీనా కళ్లు చేటంత చేసుకుంది. యీ చిన్న వాళ్లిద్దరూ వాటి లోపలికి యెగిరి పోగలరు, అంతలా చేసుకుంది కళ్లు.

మల్వీనాని చూడగానే ప్యెరో యేదేదో గొణగడం మొదలుపెట్టేడు. ఆ మాటలు తాదు బొంగరం లేకుండా, అత్తకుండా పొత్తకుండా వున్నాయి. వాటిని రాయడం అసాధ్యం.

''యిడిగో'' అని బురతీనొ యేమీ జరగనట్టు. ''నేను అతన్ని తీసుకు వచ్చేను. నువ్వు అతనికి చదువు చెప్పడానికి'' అన్నాడు.

యిది కల కాదు నిజం అని ఆఖరికి మల్వీనా గ్రహించింది.

''అబ్బ! యెంత అద్భుతం!'' అని గొణిగింది. కాని వెంటనే పెద్ద వాళ్లు మాట్లాడినట్టు అంది. ''పిల్లలూ, వెళ్లి, పళ్లు తోముకు, స్నానం చేసి రండి. ఆర్తెమన్, పిల్లల్ని నూతి దగ్గరకి తీసుకెళ్లు'' అని పురమాయించింది.

''చూశావా? ఆమెకి బుర్రలో పురుగు వుంది! పళ్లు తోముకోండి, స్నానం చేసి రండి చంపేస్తుంది, ఆచారం గీచారం అంటూ'' అన్నాడు బురతీనొ.

మొత్తంమీద వాళ్లు స్నానాలు చేసి వచ్చేరు. ఆర్తెమాన్ కుచ్చు తోకతో వాళ్ల బట్టలు దులిపి శుభ్రం చేసింది.

వాళ్లు బల్ల దగ్గర చేరారు. బురతీనొ బుగ్గల్లోకి తిండి కుక్కుకుంటూ వున్నాడు. కాని ప్యెరో పిసరు కూడా పంటి కింద పెట్టుకోవడం లేదు. అతను మల్వీనా కేసి చూస్తూ వున్నాడంతే, ఆమెని బాదం పప్పు ఐస్‌క్రీమ్‌తో తయారు చేసినట్టు! ఆమెకి అతనలా చూస్తూ వుండడం చిరాకెత్తించింది.

''వూఁ! యేమిటలా నా మొహంకేసే చూస్తూ వుంటావు? యేముందక్కడ? రండి, నాస్తా తిందురు గాని, బెంగపడాల్సింది యేదీ లేదు'' అంది.

''మల్వీనా, యెంత కాలమైందో నేను యేదన్నా కతికి. నేను కవిత్వం అల్లుతున్నాను'' అన్నాడు ప్యెరో.

బురతీనొ నవ్వీ నవ్వీ తెగనవ్వేడు.

మల్వీనా ఆశ్చర్యపోయి కళ్లు యింకా పెద్దవి చేసింది.

''అలానా? అయితే కాసిని పద్యాలు చదువు'' అంది.

ఆమె ముచ్చటైన చిన్న చేతిమీద చెక్కిలి ఆనించింది. ముచ్చటైన చిన్ని కళ్లని పిల్లి తలలాగా కనిపిస్తూ వున్న మేఘంకేసి యెత్తి చూసింది. ప్యెరో యెంతో విచారకరమైన గొంతుకతో చదివేడు.

యేదో నూతిలోనుంచి వచ్చినట్టుగా వుందా గొంతుక.

'మాల్వీనా పోయింది దేశంనుంచి
మాట యిచ్చి పోయింది నన్ను దుఃఖంలో ముంచి
వెక్కి వెక్కి యేడ్చాను, అయ్యో, యెటు పోను?
అబ్బా! యీ బొమ్మ బతుకు అంతం కాను!''

ప్యెరో చదవడం పూర్తిచేసి, మల్వీనా తనకి బాగా నచ్చిన యీ పద్యాన్ని మెచ్చుకునే లోపలే వో భేకం ఇసిక దారిలో ప్రత్యక్షం అయింది.

''నిన్న రాత్రి తర్చిల తాబేలు మతిపోయి బంగారు తాళం గురించిన యావత్తూ కరబాస్ బరబాస్‌కి చెప్పేసింది'' అని భయంతో మిడిగుడ్లు మిటకరిస్తూ చెప్పింది.

యీ గొడవంతా యేమిటో తెలికపోయినా మల్వీనా భయంతో కెవ్వున అరిచింది. కవులందరిలాగా పరధ్యానంగా వున్న ప్యెరో యేవో అర్థంపర్థంలేని మాటలు కాసిని గొణిగేడు. వాటిని యిక్కడ రాయం లెండి. కాని, బురతీనొ మాత్రం వొక్క వుదుట్న యెగిరిగెంతి జేబులో మిఠాయిలు, పంచదార, కేకులు కుక్కుకోవడం మొదలెట్టాడు.

''మనం వీలైనంత తొందరగా పారిపోవాలి. పోలీసు కుక్కలు కరబాస్ బరబాస్‌ని యిక్కడికి తీసుకు వస్తే మన పని గోవిందా!'' అన్నాడు బురతీనొ.

మల్వీనా తెల్ల సీతాకోకచిలక రెక్కలాగా పాలిపోయింది. ఆమె చచ్చిపోతోందేమో ననుకుని ప్యెరో కూజాని తొట్రుటు పడేశాడు. మల్వీనా చక్కటి గౌను అంతా కోకో మరకలు పడ్డాయి.

ఆర్తెమాన్ గట్టిగా మొరుగుతూ పైకి యెగిరింది. మల్వీనా బట్టలు వుతకడం ఆ కుక్క పని. ప్యెరో మెడ అంది పుచ్చుకుని అతన్ని కుదపడం మొదలెట్టింది. ప్యెరో వున్నట్టుండి ''చాలు... చా... లు!'' అనేదాకా కుదుపుతూనే వుంది.

మిడిగుడ్ల భేకం యీ గొడవంతట్నీ చూస్తూ వుంది.

''వో పావుగంటలో కరబాస్ బరబాస్ పోలీసు కుక్కలతో యిక్కడికి వస్తాడు'' అంది.

మల్వీనా బట్టలు మార్చుకుందామని పరిగెత్తింది. ప్యెరో దిక్కు తోచక చేతులు మెలితిప్పకున్నాడు. ఇసిక నేలమీద పడబోయేడు కూడా. ఆర్తెమాన్ బోలెడు వస్తువుల్ని తీసుకు బయటికి వచ్చింది. తలుపులు ధనధన కొట్టుకున్నాయి. వో పొదలో పిచికలు కిచకిచలాడేవి. స్వాలో పిట్టలు సర్రన కిందికి దూసుకువచ్చేయి. దాదాపు నేలని తాకేయి. యీ గోల చాలదన్నట్టు గుడ్లగూబ పిచ్చిగా అటకమీద కూసింది.

బురతీనొ వొక్కడే స్థిమితంగా వున్నాడు. అత్యవసరమైన సరుకుల మూటలు రెండు ఆర్తెమాన్

వీపుమీద పెట్టి, చక్కని ప్రయాణం గౌను తొడుక్కున్న మల్వీనాని ఆ మూటల పైన కూర్చో బెట్టాడు. ఆ కుక్క తోక బట్టుకు వుండమని ప్యెరోకి చెప్పాడు. తను మాత్రం ముందు నుంచున్నాడు.

“మరేం బెదరాల్సిన పన్లేదు. పదండి” అన్నాడు.

బురతీనొ మగవీరుడిలాగా ముందు నడుస్తున్నాడు. మల్వీనా మూటలమీద అటూ యిటూ కదుల్తోంది. లోకజ్ఞానంకంటే లల్లాయి ఉల్లాయి పదాలు బుర్రనిండా వున్న ప్యెరో వెనక వున్నాడు. యీ రకంగా యీ బృందం దట్టమైన గడ్డి గుబురునుంచి మైదానంమీదకి రాగానే చీకిరిబీకిరిగా వున్న కరబాస్ బరబాస్ గడ్డం ముందు కనిపించే చెట్ల వెనకనుంచి యెదరకి పడడం కంటబడింది. అతను యెండకి కళ్ళకి చేతులు అడ్డం పెట్టుకుని నాలుగు దిక్కులా పరకాయించి చూస్తున్నాడు.



## అడివి శివారున ఘోరమైన పోరు

కరబాస్ బరబాస్ రెండు పోలీసు కుక్కల్నీ మెడ తాళ్లతో పట్టుకున్నాడు. పారిపోతూ వున్న యీ బృందాన్ని మైదానంమీద చూడగానే పెద్ద పళ్లు వున్న అతని నోరు ఆమ్మని తెరుచుకుంది.

''వుస్కో'' అని అరిచాడు ఆ కుక్కల తాళ్లు వదిలి. ఆ కుక్కలు వెనక కాళ్లతో మొదట నేలని తవ్వడం మొదలెట్టాయి. తమ బలం పట్ల వాటికి యెంత గర్వంగా వుందంటే అవి గుర్‌మని కూడా అన్లేదు. పారిపోతూ వున్న వాళ్లకేసి కాకుండా పక్కకి చూశాయి.

ఆ తర్వాత అవి బురతీనొ, ఆర్తెమాన్, ప్యెరో, మల్వీనా మేకుల్లా బిగిసిపోయి నుంచున్న చోటుకి మెల్లిగా వెళ్లాయి.

అంతా ముగిసినట్టే కనిపించింది. కరబాస్ బరబాస్ కాలి వేళ్ల లోపలికి ముడుచుకుని పోలీసు కుక్కల వెనక్కాల వస్తున్నాడు. అతని గడ్డం చొక్కా జేబులోనుంచి యివతలికి వూడొస్తూనే వుంది. కాళ్లకి అడ్డం పడుతూనే వుంది.

ఆర్తెమాన్ తోక కాళ్ల మధ్య ముడుచుకుని వికారంగా గుర్‌మంది. మల్వీనా చేతులు మెలి తిప్పుకుంది.

''నాకు భయంగా వుంది, నాకు భయంగా వుంది'' అని అరిచింది.

ప్యెరోకి గుండె జారిపోయింది. మల్వీనాకేసి చూశేడు. అంతా గోవిందా అయిపోయిందనిపించింది.

మొదట ఆలోచన తట్టింది బురతీనొకే.

''ప్యెరో, యీ అమ్మాయిని తీసుకుని హంసలు వున్న సరస్సు దగ్గరికి పారిపో. ఆర్తెమాన్, మూటలు కింద పారేసి గడియారం విప్పెయ్యి. నువ్వు యుద్ధం చెయ్యాలిప్పుడు'' అని అరిచేడు.

ధైర్యం చెప్పే యీ మాటలు చెవిన బడగానే మల్వీనా ఆర్తెమాన్ వీపుమీదనుంచి కిందికి దూకి ఫ్రాక్‌ని చేత్తో పైకి లాక్కుంటూ సరస్సు దగ్గరికి పరిగెత్తింది. ప్యెరో వెనక్కాలే వెళ్లాడు.

ఆర్తెమాన్ మూటలు కింద పారేసింది. రిస్టువాచీ విప్పేసింది. తోక కుచ్చుమీదనుంచి రిబ్బన్ తీసేసింది. తెల్లని పళ్లని బయట పెట్టి కుడి వేపు గెంతింది. తర్వాత యెడం వేపు గెంతింది. అలా కండరాలు సవరించుకుంది. వెనక కాళ్లతో నేలమీద మెల్లిగా గీరడం కూడా మొదలుపెట్టింది.

మైదానంమీద వున్న వొక్కగానొక్క ఇటాలియన్ పైన్ చెట్టు బంక కాండాన్ని చుట్టుకు యెక్కేసి అంకిళ్లు పడిపోయేట్టు అరిచీ మొత్తుకునీ కేకలు మొదలుపెట్టేడు.

''పిట్టలూ! జంతువులూ! కీటకాలూ! మామీద దాడి జరుగుతోంది. రండి, వెర్రిబాగుల

కొయ్య బొమ్మలం మమ్మల్ని రక్షించండి'' అని అరిచేడు.

పోలీసు కుక్కలు అప్పుడే ఆర్తెమాన్‌ని చూసినట్టుగా వెంటనే దానిమీదకీ దూకేయి. మెరికలా వున్న ఆ కుక్క కుంయ్‌మని వో కుక్క తోకనీ, యింకో కుక్క తొడనీ కొరికింది.

పోలీసు కుక్కలు ఆ చుట్టుతా యెడ్డిగా సుళ్లు తిరిగి మళ్లీ ఆర్తెమాన్‌మీదకి యెగిరాయి. కాని ఆర్తెమాన్ గాలిలోకి యెగిరింది, పోలీసు కుక్కల విసురు కింద తప్పిపోయింది. ఆర్తెమాన్ మళ్లీ వో పోలీసు కుక్క డొక్కనీ, మరో పోలీసు కుక్క వీపునీ కరిచింది.

మూడవ సారి పోలీసు కుక్కలు దాడి చేశాయి. యీ సారి ఆర్తెమాన్ తోక గడ్డిమీద యీడుస్తూ దూసుకుపోయింది. మైదానంమీద గుండ్రంగా సుళ్లు తిరిగింది. తిరిగి పోలీసు కుక్కల దగ్గరికి తిన్నగా కాసేపు వెళ్లింది. యింతట్లోకీ సరిగ్గా వాటి ముట్టెల కిందకి పక్కలనుంచి దూసుకు వెళ్లింది.

ఆ దెబ్బతో దిబ్బ ముక్కు పోలీసు కుక్కలకి మంట తలకెక్కింది. అవి బుసకొట్టి ఆర్తెమాన్ వెనక బడ్డాయి, యెలాగైనా యీ చురుకైన కుక్క పీక కొరకాలని లేదా తమ ప్రాణాల్ని అర్పించాలని అని పట్టుగా వున్నట్టే కనిపించేయి.

యీ లోపున కరబాస్ బరబాస్ ఇటాలియన్ పైన్ చెట్టు దగ్గరికి వెళ్లాడు. కాండం పట్టుకున్నాడు. దాన్ని కుదపడం మొదలుపెట్టాడు.

''దిగిరా! దిగిరా!''

బురతీనొ కొమ్మని చేతులతో, కాళ్లతో, పాదాలతో గట్టిగా పట్టుకున్నాడు. కరబాస్ బరబాస్ యెంత గట్టిగా కుదిపేడంటే కొమ్మలమీద కాయలు అటూ యిటూ వూగేయి.

ఇటాలియన్ పైన్ చెట్టుకి పెద్ద, ముళ్ల కాయలున్నాయి. అవి వొకోటీ పుచ్చకాయలంతేసి వున్నాయి. తలమీద అలాంటి కాయ వొకటి పడితే చూడండి బాబూ యెలా వుంటుందో!

బురతీనొ అలా వూగులాడే కొమ్మమీద పట్టు సరిగా నిలుపు కోలేకుండా వున్నాడు. ఆర్తెమాన్ నాలిక యెర్రగుడ్డ పీలికలాగా వేలాడుతూ వుండడం, దాని యెగురుడు రానురాను మందగించడం అతనికి కనిపిస్తూనే వున్నాయి.

''ఆ తాళం యిలా యియ్యి!'' అని కరబాస్ బరబాస్ గొంతుక చించుకు అరుస్తూనే వున్నాడు. అసహ్యంగా వుండే అతని నోరు బార్లా తెరుచుకుంది.

బురతీనొ కొమ్మని అంటి పెట్టుకు పాకుతూ వో మాదిరి కాయని చేరుకుని దాని ముచికని కొరకడం మొదలుపెట్టాడు. కరబాస్ బరబాస్ యింకా గట్టిగా కుదపడం మొదలుపెట్టాడు. ఆ భారీ కాయ టపామని వూడిపడి కరబాస్ బరబాస్ దవడల్లో పడింది.

ఆ దెబ్బకి కరబాస్ బరబాస్ చతికిల పడ్డాడు.

బురతీనొ రెండో కాయని తెంపేడు. అది సరిగ్గా కరబాస్ బరబాస్ మాడుమీద మద్దెల దరువులాగా పడింది.

"మామీద దాడి చేస్తున్నారు! రండి వచ్చి వెర్రిబాగుల కొయ్య బొమ్మలమైన మమ్మల్ని రక్షించండి" అని బురతీనొ మళ్లీ అరిచేడు.

మొదటగా వాళ్లని కాపాడ్డానికి వచ్చినవి స్విఫ్ట్ పిట్టలు. కత్తి దూసుకు పోయినట్టుగా అవి గాలిలో పోలీసు కుక్కల ముట్టెలమీదుగా తాసుకుంటూ యెగిరిపోయేయి.

అవి టక్కన గాలిలో పళ్లు కొరికేయి, కాని యేం ప్రయోజనం లేకపోయింది. స్విఫ్ట్ పిట్ట యీగ కాదు. అది మెరుపు తీగలాగా దూసుకుపోతుంది, కుక్కల ముట్టెలమీద.

పిల్లి తలలాంటి మేఘం మాటునుంచి వో నల్లని రాబందు దిగి వచ్చింది. ఆ రాబందే మల్వీనాకి వేటని తెచ్చి పెట్టేది. అది వో పోలీసు కుక్క వీపుమీద గోళ్లు గుచ్చింది, పైకి యెగిరింది, తన బలమైన రెక్కలమీద లేస్తూ వో పోలీసు కుక్కని పైకి లేపేసింది. అక్కణ్ణుంచి కింద పడేసింది.

కుక్క తలకిందులుగా నేలమీద తపామని చప్పుడు చేస్తూ కుంయోమంటూ పడింది.

ఆర్తెమాన్ రెండో కుక్కమీద నేరుగా దాడి చేసింది. దాని ఛాతీ పట్టుకుంది. బోర్లా తోసింది. బరికేసింది. వెనక ఎగిరింది.

మళ్లీ ఆర్తెమాన్, బాగా నలిగి చితికిపోయిన ఆ రెండు పోలీసు కుక్కలూ ఆ వొంటరి పైన్ చెట్టు చుట్టూతా మైదానంమీద దూకుడుగా పోయేయి.

అప్పుడు బోదురు కప్పలు ఆర్తెమాన్‌కి సాయం వచ్చేయి. అవి ముసలితనం వల్ల కంటి చూపు పోయిన రెండు పాముల్ని యీడ్చుకువచ్చేయి. అవి యెలాగైనా చచ్చిపోయేవే. చివికిన మొద్దు కిందో, హెరాన్ పిట్ట పొట్ట లోపలో చావు తప్పదు వాటికి. అంచేత వీరమరణానికి సన్నద్ధం కమ్మని బోదురు కప్పలు వాటిని రెచ్చగొట్టాయి.

ఆ సమయంలో ఆర్తెమాన్ కుక్క సరాసరి పోరుకి సన్నద్ధం అయింది.

వెనక పంజాలమీద కూర్చుని కోరలు బయట పెట్టింది.

పోలీసు కుక్కలు దానిమీదకి దూసుకు వెళ్లాయి. అవీ, ఆర్తెమాన్ కలిసి సుడిగాలిలా దొర్లి పోయేయి.

ఆర్తెమాన్ కటక్కన దవడల్తో కొరికింది, పంజాలతో దెబ్బలాడింది. ఆ బరుకుల్నీ, గీరుల్నీ పట్టించుకోకుండానే పోలీసు కుక్కలు అదును కోసం చూశాయి: వొడేసి ఆర్తెమాన్ పీక పట్టుకోవాలని. యుద్ధం మొత్తం పొలం అంతా భీషణంగా సాగింది.

ముళ్లపంది కుటుంబం ఆర్తెమాన్‌కి సాయం వచ్చింది. యజమాని ముళ్లపంది, తల్లి ముళ్ల

పంది, అత్త ముళ్లపంది, కన్య పిన్ని ముళ్లపందులు రెండు, చిన్న ముళ్లపందులు అన్నీ వచ్చేయి.

బొద్దుగా, మఖమల్ కుచ్చు బంగారు గౌన్లు వున్న బంబల్‌బీలు ఝుమ్మంటూ వచ్చేయి. కంది రీగలు భయపెడుతూ రెక్కలు ఆడించేయి. పొడుగాటి మీసాల ముళ్ల పురుగులు పాక్కుంటూ వచ్చేయి.

జంతువులు, పక్షులు, పురుగులు వొళ్లు దాచుకోకుండా దుష్ట శునకాలమీదకి లంఘించాయి.

ముళ్లపందులు అన్నీ ఉంగలు చుట్టుకుపోయి బంతుల్లాగా తిరిగేస్తూ పోలీసు కుక్కల ముట్టెలమీద కుట్టేయి.

బంబల్‌బీలూ, కందిరీగలూ పోలీసు కుక్కలు దూసుకుపోతూ వుండగా మధ్యలో కుట్టేయి. అవి కుడితే విషం దిగినట్టు వుంటుంది. చీమలు కావాల్సికి వాటి ముకు పుటాల్లో దూరి అక్కడ తమ విషం కక్కేయి.

పురుగులు వాటిని పొట్టల పైన కుట్టేయి.

వంగిన ముక్కు వున్న రాబందు మొదట వో కుక్కని, తర్వాత మరోదాన్ని మాడుమీద పొడిచింది.

సీతాకోకచిలకలూ, యీగలూ వొక్కుమ్మడిగా వాటి కళ్ల ముందు యెగిరి మేఘంలాగా కమ్మి వాటికి చూపు ఆనకుండా చేశాయి.

బోదురు కప్పలు ఆ రెండు పాముల్నీ తయారుగా వుంచుకున్నాయి. ఆ పాములు రెండు వీరమరణానికి సిద్ధమై వున్నాయి.

చీమలు కక్కిన విషం చీదుకోవడానికి వో కుక్క తుమ్మగానే గుడ్డి పాము వొకటి మొదట దాని నోట్లో దూరి మరలాగా దిగిపోయింది. రెండో దానికీ అలానే జరిగింది. రెండో పాము దాని నోట్లోకి పోయింది. రెండు కుక్కలూ గిచ్చుకున్నాయి, గింజుకున్నాయి, వూపిరి ఆడక నిస్సహాయంగా నేలమీద పడి దొర్లేయి. మంచి కుక్క ఆర్తెమాన్ పోరులో విజేతగా బయటపడింది.

యీ లోపున కరబాస్ బరబాస్ ముళ్ల కాయని తన పెద్ద నోట్లోనుంచి వూడ పీక్కున్నాడు.

మాడుమీద తగిలిన దెబ్బకి అతని కళ్లు తిరుగుతున్నాయి. అతను గిర్రున వూగిపోతూ ఇటాలియన్ పైన్ చెట్టుని పట్టుకున్నాడు. గాలికి అతని గడ్డం రేగిపోయింది.

చెట్టుపైన కూర్చున్న బురతీనో గాలికి కరబాస్ బరబాస్ గడ్డం రేగిందని గమనించేడు. అది అలా రేగి జిగురుగా వున్న చెట్టు కాండానికి అతుక్కుపోయింది. బురతీనో వో కొమ్మ పట్టుకు వేలాడేడు.

"నన్ను పట్టుకోలేవు, నన్ను పట్టుకోలేవు నాయనా" అని వుడికిస్తూ యేడిపించేడు.

నేలమీదకి వురికి చెట్టు చుట్టూతా ప్రదక్షిణగా తిరగడం మొదలుపెట్టాడు. కరబాస్ బరబాస్ అతన్ని అందుకోవడానికి చేతులు చాచేడు. చెట్టు చుట్టూతా సుళ్లు తిరిగిపోయేడు.

అతను వో సారి చుట్టు తిరిగేడు. అతని చేతికి బురతీనొ అందినట్టే అనిపించింది. అలా రెండో సారి, మూడో సారి తిరిగేడు.

అతను చుట్టు తిరిగిన ప్రతిసారీ అతని గడ్డం చెట్టు జిగురుకి అతుక్కుపోతూనే వుంది.

అలా అది చుట్టుకుపోయి చివరకి గడ్డం అంతా అతను యిక కదల్లేనట్టుగా చుట్టుకు పోయింది. కరబాస్ బరబాస్ ముక్కు చెట్టు కాండానికి అతుక్కుంది. బురతీనొ నాలిక బయట పెట్టి వెక్కిరిస్తూ హంసల సరస్సు దగ్గరికి మల్వీనా, ప్యెరోలని వెతకడానికి వెళ్లిపోయేడు.



ఆర్తెమాన్ వో కాలిని ముడుచుకుని మిగిలిన మూడు కాళ్లమీదా కుంటుకుంటూ బురతీనొ వెనక వెళ్లింది.

రెండు పోలీసు కుక్కలూ మైదానంమీద వుండిపోయేయి. అవి బతికి వున్నా చచ్చిన వాటి విలువ చెయ్యవు. అవి బతకగలవని చచ్చిన యీగని కూడా పందెం కట్టలేరు. కీలుబొమ్మల థియేటరు యజమాని దిక్కు తోచకుండా పోయిన వాడిలాగా ఇటాలియన్ పైన్ చెట్టుకి గడ్డంతో కరుచుకుపోయేడు.

# గుహలో

మల్వీనా, ప్యెరోలు రెల్లు మధ్య వెచ్చగా, చెమ్మగా వున్న చోట కూర్చున్నారు. వాళ్ల తలల పైన సాలెగూడు అల్లుకుంది. దాని పైన తూనీగ రెక్కలు, పురుగుల రెక్కలు చెదిరి వున్నాయి. ఆ రెక్కలు యెండిపోయి వున్నాయి.

చిన్న చిన్న నీలం పిట్టలు రెల్లునుంచి రెల్లుకి యెగురుతున్నాయి. ఆ చిన్న పిల్ల యేడుస్తూ వుంటే యేమిటి చెప్మా అని ఆశ్చర్యంతో చూస్తూ వున్నాయి. దూరంనుంచి పిచ్చి గోల, కేకలు వాళ్ల చెవిన బడుతున్నాయి. ఆర్తెమాన్ బురతీనొలు ప్రాణం వొడ్డి పోరుతున్నారు.

"నాకు భయంగా వుంది, నాకు భయంగా వుంది" అని మల్వీనా రెట్టిస్తూనే వుంది, కన్నీళ్ల చారికలు కట్టిన ముఖాన్ని ఆకులతో కప్పుకుంటూనే వుంది.

ప్యెరో యేవో పదాలు పాడి ఆమెని వూరడించబోతున్నాడు.

కూర్చున్నాము వెచ్చని చోట
చుట్టూతానూ పువ్వుల తోట
కమ్మని పువ్వుల తావులలోన
పరవశించెదము నువ్వూ నేను
వేసవి అంతా గడుపుదు మిటులే
ఆడుదు పాడుదు మాటలు పాటలు
లోకులు అందరు అచ్చెరు వందగ
మన వేడుక చూసి మనసున కుందగ.

"అబ్బ! అబ్బబ్బ! నువ్వంటే నాకు మొహం మొత్తింది, నాయనా!" అంది మల్వీనా కాళ్లతో తన్నుతూ. "యింకో ఆకు తీసియియ్యి, కనిపించడంలా యీ ఆకు అంతా తడిసింది, చిల్లులే!" అంది.

హఠాత్తుగా గోల, చప్పుళ్లూ ఆగిపోయేయి. మల్వీనా అయ్యో కొంప మునిగిపోయింది అన్న వాలకం పెట్టింది.

"ఆర్తెమాన్, బురతీనొలు! వాళ్లని చంపేశారు!"

ఆమె అక్కడ పెరుగుతూ వున్న ఆకుపచ్చ గుబురుల్లో ముఖం చాటు చేసుకుంది.

ప్యెరో నిస్సహాయంగా ఆమె చుట్టూ తిరిగేడు. రెల్లులో గాలి సంయ్‌మంది.

తర్వాత అడుగుల చప్పుడు వినిపించింది. అనుమానం లేదు మల్వీనానీ, ప్యెరోనీ పట్టుకుని అడుగు

కనిపించని తన జేబుల్లోకి దోపేసుకుందామని కరబాస్ బరబాస్ వస్తున్నాడు. రెల్లు అటూ యిటూ దారి చేస్తూ విడింది. చిత్రం! ఆ వచ్చింది యెవరు! ముక్కు యెదరకి పొడుచుకు వస్తూ, నోరంతా పళ్లు చేసుకుని యికిలిస్తూ వున్న బురతీనొ! అతని వెనక్కాల కుంటుకుంటూ కుంటుకుంటూ మూటలు మోస్తూ వస్తోంది ఆర్తెమాన్.

''వాళ్లు నాతో దెబ్బలాడ దామనుకున్నారు'' అన్నాడు బురతీనొ మల్వీనా, ప్యెరోల ముఖాల్లో కనిపించే సంతోషం గురించి పట్టించుకోకుండా. ''అందర్నీ, పిల్లిని, నక్కని, పోలీసు కుక్కల్ని, కరబాస్ బరబాస్‌నీ కట్టకట్టుకు రమ్మనమనండి. వుఫ్! నాకు లెక్కా జమా లేదు. రా, అమ్మాయీ, కుక్క వీపు యెక్కు. ఏయ్, చిన్నాడా, తోక పట్టుకో. పదండి'' అంటూ అతను మగధీరుడిలాగా, రెల్లుని పక్కకి తప్పిస్తూ సరస్సు దాటి అవతలి వేపు నడిచేడు.

యుద్ధం యెలా జరిగింది, పోలీసు కుక్కలు యేమయాయి, కరబాస్ బరబాస్ తరుముకు వస్తున్నాడా యేమిటి అని అడిగే ధైర్యం మల్వీనాకీ, ప్యెరోకీ లేకపోయింది.

సరస్సు అవలి వేపు చేరుకున్నాక ఆర్తెమాన్ కుంయ్‌కుంయ్ మనడం మొదలుపెట్టింది. యెక్కువ కుంటడం మొదలుపెట్టింది. ఆగి, బేండేజీ కట్టాల్సి వచ్చింది. రాళ్ల కొండమీద పెరిగిన పెద్ద పైన్ చెట్టు కింద వాళ్లకి వో గుహ కనిపించింది. వాళ్లు అక్కడికి మూటలు మోసుకువెళ్లారు. ఆర్తెమాన్ లోపలికి పాకి వెళ్లింది.

పాపం ఆ కుక్క మొదటగా అన్ని పంజాలనీ నాక్కుంది. తర్వాత కాళ్లని మల్వీనా వేపు చాచింది. బురతీనొ మల్వీనా పాత బట్టల్లో వొక దాన్ని చింపి బేండేజీలు చేశాడు. ప్యెరో సాయం చేస్తే మల్వీనా బేండేజీ కట్టింది.

బేండేజీ కట్టేక వాళ్లు ఆర్తెమాన్ టెంపరేచర్ చూశారు. ఆర్తెమాన్ హాయిగా నిద్రపోయింది.

''ప్యెరో, సరస్సు దగ్గరికి వెళ్లి నీళ్లు తే'' అన్నాడు బురతీనొ.

ప్యెరో యేం యెదురు చెప్పకుండా, పద్యాలు లోపల్లోపల గొణుక్కుంటూ, తడబడుతూ వెళ్లేడు. దారిలో కూజా మూత పారేసుకున్నాడు. తిరిగి వచ్చేటప్పటికి అడుగున వో చుక్క నీరు మాత్రం మిగిలింది.

''మల్వీనా! నెగడు వేసుకుందాం వెళ్లి కాసిని చితుకులు యేరుకురా'' అన్నాడు బురతీనొ.

మల్వీనా అతనికేసి కొరకొర చూసింది, యేమిటన్నట్టు భుజాలు యెగరేసింది. కాని వెళ్లి కాసిని యెండు పుల్లలు యేరుకు వచ్చింది.

''యేం సుకుమారులండీ, యీ గోముగా పెంచిన మనుషులు'' అన్నాడు బురతీనొ.

తనే వెళ్లి నీళ్లు తెచ్చుకున్నాడు. కాసిని యెండు పుల్లలు యేరుకొచ్చేడు. నెగడు వేశాడు గుహ

ముందు. మంట యెంత భగభగ మండిందంటే పొడుగాటి పైన్ చెట్టు కొమ్మలు వూగేయి. తనే నీళ్లు కాచి కోకో తయారు చేశాడు.

"రండి! నాస్తా తయారైంది."

మల్వీనా అంతసేపూ యేం మాట్లాడకుండా కూర్చుంది. మూతి బిగించుకు కూర్చుంది. యిప్పుడు పెద్ద వాళ్ల గొంతుకతో చాలా దృఢంగా మాట్లాడింది.

"బురతీనో, కుక్కలతో పోరి, వాటిని చావగొట్టి మమ్మల్ని కరబాస్ బరబాస్ బారినుంచి రక్షించి మహాధైర్యంగా వున్నంత మాత్రాన నాస్తా తినే ముందు కాళ్లు చేతులూ, మొహమూ పళ్లూ కడుక్కో నక్కర్లేదనుకోకు" అంది.

బురతీనో యేం తోచక చతికిల పడ్డాడు. వూఁ, భేషుగ్గా వుంది. పట్టుదలగా వున్న చిన్న యజమానురాల్ని చూస్తూ వుంటే అతని కళ్లు ఉబ్బేయి.

మల్వీనా గుహ బయటికి వెళ్లి చేతులు చరిచింది.

"సీతాకోకచిలకలూ, గొంగళిపురుగులూ, పేడపురుగులూ బోదురు కప్పలూ!" అని పిలిచింది.

వొంటినిండా పుప్పొడి కొట్టుకుపోయిన పెద్ద సీతాకోకచిలకలు, గొంగళిపురుగులు, పేడపురుగులూ యిట్టే చక్కా వచ్చేయి. బోదురు కప్పలు పొట్టలమీద డేక్కుంటూ వచ్చేయి.

సీతాకోకచిలకలు రెక్కలు మెల్లిగా ఆడిస్తూ గుహ లోపల గోడమీద వాలేయి. దాంతో గుహ అందంగా కనిపించింది. మట్టి వూడి తినే తిండిలో పడకుండా యివి ఆపేయి. పేడపురుగులు గుహలో వున్న చెత్తా చెదారం పోగు చేసి వూడ్చి మూలకి చేర్చాయి. తర్వాత అవతల పారేశాయి.

లావుపాటి తెల్ల గొంగళిపురుగు బురతీనో తలమీదక పాకి అక్కణ్నుంచి ముక్కుమీదకి దిగింది. యేదో పేస్టుని ఉమిసింది. మరి అతను దాంతో పళ్లు కడుక్కోవాలి.

మరో గొంగళిపురుగు ప్యెరో పళ్లకి అలా చేసింది.

ఓ నిద్రమత్తు బాడ్జర్ వచ్చి జేగురు రంగు గొంగళిపురుగుల్ని పిండి పేస్టు తీసింది. తోకతో ఆ పేస్టు పెట్టి వాళ్ల మూడు జతల బూట్లనీ పాలిష్ చేసింది — మల్వీనావీ, బురతీనోవీ, ప్యెరోవీ.

తలమీద యెర్ర శిఖ వున్న హుషారైన రంగు రంగుల హూపీ పిట్ట వచ్చింది. దానికి ఆశ్చర్యం కలిగినప్పుడల్లా దాని శిఖ పైకి లేస్తుంది.

"యెవళ్లకండీ తల దువ్వాల్సింది?"

"నాకు" అంది మల్వీనా. "దువ్వి గిరజాలు తిప్పాలి. రేగిపోయింది" అంది.

"యేదీ అద్దం?" చూడమ్మా —"

"మేం తెస్తాం" అని మిడిగుడ్ల బోదురు కప్పలు అన్నాయి.

అవి పొట్టలమీద డేక్కుంటూ సరస్సు దగ్గరికి వెళ్లిపోయేయి. అద్దానికి గాను అవి బలిసి నిద్ర మత్తుగా వున్న వో చేపని యీడ్చుకు వచ్చేయి. యెంత లాగినా అది యేమీ కసరదు. అవి ఆ చేపని మల్వీనా ముందు నిల బెట్టాయి. అది నీటి బయట వూపిరి సలపకుండా చచ్చిపోకుండా వుండేందుగ్గాను అవి దాని నోట్లో కెటిల్‌లోనుంచి నీళ్లు పోస్తూనే వున్నాయి.

హడావుడిగా వుండే హూపీ పిట్ట మల్వీనా జుట్టు వంకీలు తిప్పి దువ్వింది. అది ఓ సీతాకోక చిలకని, జాగ్రత్తగా గోడలమీదనుంచి దింపి, మల్వీనా ముక్కుమీద పౌడరు అద్దింది.

బోదురు కప్పలు మళ్లీ చేపని నీటి దగ్గరికి తీసుకుపోయేయి. బురతీనో, ప్యెరోలు ముఖం, చేతులు మెడలు కూడా కడుక్కున్నారు. మల్వీనా నాస్తా ప్రారంభించింది.

తినేసాక వొళ్లో పడిన చిదపల్ని తుడిచేసుకుంది.

''చూడు బురతీనో, కిందటి సారి మనం డిక్టేషన్ మధ్యలో మానేశాం. యిప్పుడు ఆ పాఠం చూద్దాం పట్టు'' అంది.

గుహలోనుంచి వురికి పారిపోదామని బురతీనోకి అనిపించింది. యెటు దారి తీసుకుపోతే అటు పోదాం అనిపించింది. కాని వొంట్లో బాగాలేని కుక్కనీ, నిస్సహాయులైన తన నేస్తాల్నీ వదిలిపెట్టి వెళ్ల లేడు కదా!

''యేవీ, పలకా బలపం తెచ్చుకోలేదుగా!'' అని గొణిగేడు.

''తెచ్చుకోకపోవడం యేమిటి? తెచ్చుకున్నాం'' అని మూలిగింది ఆర్తెమాన్. అది మూట దగ్గరికి పాకి వెళ్లింది. పళ్లతో మూట విప్పింది. వో సిరాబుడ్డినీ, కలాన్నీ, పుస్తకాన్నీ, వో చిన్న గ్లోబునీ కూడా తీసింది.

''సిరాబుడ్డిని అలా వొంచి మరీ కలంమీదకంటా పెట్టి పట్టుకోకు. చేతినిండా సిరామరకలు చేసుకుంటావు'' అంది మల్వీనా. ఆమె ముచ్చటైన కళ్లు యెత్తి గుహ కప్పుమీద వున్న సీతాకోక చిలకల్ని చూసింది. సరిగ్గా అప్పుడు వో కొమ్మ విరిగిన చప్పుడు అయింది. బొంగురు గొంతుకలు మాట్లాడుకుంటూ వుండడం వినిపించింది. గుహ పక్కనుంచి జలగల వైద్యుడూ, కాళ్లీడ్చుకుంటూ అలిసిపోయిన కరబాస్ బరబాస్ వెళ్లేరు.

కీలుబొమ్మల థియేటరుగారి నుదుటిమీద కంద గడ్డంత బొప్పి వుంది. అతని ముక్కు వాచి పోయింది. అతని గడ్డం అంతా చిక్కు పడిపోయి, జిగురు అంటుకుపోయి వుంది.

మాట్లాడుతూ ఉమ్మేస్తూ అతను మూలిగేడు.

''వాళ్లు దూరంపోయి వుండరు. యిక్కడే యెక్కడో వుండి వుంటారు'' అన్నాడు.

# యేది యేమైనా గానీ బంగారు తాళం రహస్యం యేమిటో కరబాస్ బరబాస్ దగ్గర్నుంచి రాబట్టాలని బురతీనో నిర్ణయించుకోవడం

కరబాస్ బరబాస్, జలగల వైద్యుడు గుహ పక్కనుంచి మెల్లిగా వెళ్లారు.

మైదానంమీద పోరు జరుగుతూ వుండగా జలగల వైద్యుడు భయపడిపోయి వో పొద వెనకాల దాంకున్నాడు. పోరాటం అంతా అయిపోయేక బారుగా వున్న గడ్డిలో బురతీనో, ఆర్తెమాన్ కనిపించకుండా వెళ్లిపోయేదాకా కూర్చున్నాడు. ఆ తర్వాత మహా ప్రయాసపడి ఇటాలియన్ పైన్ చెట్టు కాండంనుంచి కరబాస్ బరబాస్ గడ్డాన్ని విడదీశాడు.

''బాగానే వుంది, యీ కుర్రకుంక మిమ్మల్ని హూనం చేసేశాడు. మంచి రకం వో డజను జలగల్ని మీ మెడ వెనక పట్టించాలి'' అన్నాడు జలగల వైద్యుడు.

''ఛవ్! నీ గోల తగలెయ్య!'' అని కరబాస్ బరబాస్ గర్జించేడు. ''నడు, గబగబా తగులుడు! వెళ్లి ఆ తుంటరులని పట్టుకోవాలి'' అన్నాడు.

కరబాస్ బరబాస్, జలగల వైద్యుడూ వాళ్లని వెంబడించడం కోసం బయల్దేరారు. గడ్డిని అటూ యిటూ తొలిగించేరు, ప్రతి పొదనీ పరీక్షగా చూశేరు, ప్రతి దుబ్బునీ గాలించేరు.

పాత పైన్ చెట్టు మొదలునుంచి పొగ రావడం వాళ్ల కంట బడింది. కాని యీ కొయ్య బొమ్మలు గుహ లోపల వున్నట్టూ, మంట వేసుకున్నట్టు వాళ్ల బుర్రలకి తట్టనే లేదు.

''ఆ తుంటరి బురతీనోని నా చాకుతో ముక్కలు ముక్కలుగా తరిగేస్తాను'' అని కరబాస్ బరబాస్ గొణిగేడు.

యీ పారిపోయిన వాళ్లు గుహ లోపల ఉగ్గబట్టుకు కూర్చున్నారు.

యేం చెయ్యాలిప్పుడు? పారిపోవాలా? కాని ఆర్తెమాన్ వొళ్లంతా బేండేజీలతో గాఢ నిద్రలో వుంది. గాయాలు నయం అవాలంటే అది యిరవై నాలుగు గంటలు నిద్రపోవాలి.

పాపం ఆ కుక్కని వదిలిపెట్టేసి గుహలో వొక్క దాన్నీ వొంటరిగా వదిలేసి వెళ్లిపోవడమే?

వీల్లేదు, పారిపోయే ప్రశ్నే లేదు. మునిగినా తేలినా అందరూ కలిసి వుండాల్సిందే.

బురతీనో, ప్యెరో, మల్వీనా కలిసి కూర్చుని గుహ లోపల చాలా సేపు అన్ని విషయాల గురించీ చర్చించేరు. తెల్లవారే దాకా ఆగి చూడాలని, రొబ్బలతో కొమ్మలతో గుహా ముఖాన్ని కప్పెయ్యాలనీ, ఆర్తెమాన్ గబగబా కోలుకుందుకు తిండి పెట్టి, ఇంజెక్షన్లు చెయ్యాలనీ తీర్మానం చేశారు.

''యేది యేమైనా నేను కరబాస్ బరబాస్‌నుంచి యీ బంగారు తాళంతో తీసే చిన్న తలుపు గురించి సమాచారం రాబట్టాలి. ఆ చిన్న తలుపు వెనక్కాల యేదో అద్భుతమైందీ, అసాధారణమైందీ

వుంది. మనకి అది ఆనందాన్ని ప్రసాదిస్తుందని నాకు తెలుసు'' అన్నాడు బురతీనో.

''నువ్వు లేకుండా యిక్కడ యెక్కువసేపు వుండాలంటే నాకు భయంగా వుంది, నాకు భయంగా వుంది'' అంది మల్వీనా.

''ప్యేరో యేమన్నా పని కొస్తాడా?''

''వుఫ్! వూరికే పద్యాలు చదువుతూ కూర్చుంటాడు.''

''నేను మల్వీనాని సింహంలాగా కాపాడతాను. నా సంగతి మీకు యింకా తెలీదు'' అని ప్యేరో పెద్ద యుద్ధ వీరునిలాగా బొంగురుగా అన్నాడు.

''అదీ అలా వుండాలి ప్యేరో — అదునుకి అలా వుండాలి'' అని బురతీనో కరబాస్ బరబాస్‌నీ, జలగల వైద్యుణ్ణీ అందుకోవడానికి పరిగెత్తిపోయేడు.

అతనికి కొంచెం సేపట్లోనే వాళ్లు కనిపించేరు. కీలుబొమ్మల థియేటర్ డైరెక్టరు యేటి వొడ్డున కూర్చున్నాడు. జలగల వైద్యుడు అతని మూపుమీద నీటితుంగ ఆకులు పెడుతున్నాడు. కరబాస్ బరబాస్ ఖాళీ కడుపు గుడగుడ మనడం, జలగల వైద్యుడి కడుపులో కామన్న గంతులు వెయ్యడం దూరానికి వినిపిస్తోంది.

''యేమండోయ్! యేదో యింత లోపల పడాలి. యీ తుంటరుల కోసం వేట రాత్రి పొద్దు పోయేదాకా సాగేటట్టే వుంది'' అన్నాడు జలగల వైద్యుడు.

''యిలా వున్న పళంగా వో పంది పిల్లని, వో జత బాతుల్ని ఆమ్మని మింగేస్తాను'' అన్నాడు కరబాస్ బరబాస్ మబ్బుగా.

వాళ్లు మిట్టమీద ''మూడు చేపలు'' అని పూటకూళ్ల యింటి బోర్డు కనిపిస్తూ వున్న చోటికి యీడ్చుకుంటూ వెళ్లారు. వాళ్ల కంట బడకుండా వుండడానికి గడ్డిలో నక్కి నక్కి వొంగి బురతీనో దూసుకుపోయి వాళ్లకంటే ముందే అక్కడికి చేరాడు.

పూటకూళ్ల యింటి దగ్గర అతనికి వో భారీ కోడిపుంజు కనిపించింది. దానికి అప్పుడే వో గింజో యేదో దొరికింది. అది గర్వంగా తురాయి యెగరేసుకుంటూ, గోళ్లతో ఆందోళనగా నేల బరుకుతూ కోడిపెట్టల్ని రమ్మని పిలుస్తోంది.

''క్... క్... క్!..''

బురతీనో దాని ముందు బాదం పప్పు అప్పచ్చి పట్టుకుని చెయ్యి చాచేడు.

''యింద తీసుకో, శ్రీ శ్రీ శ్రీ సైన్యాధ్యక్షా.''

పుంజు ఆ కొయ్య బొమ్మకేసి యెవరు నువ్వు అన్నట్టు ధిక్కారంగా చూసింది కాని అదుపు చేసుకోలేక అతని చేతిలో వున్న అప్పచ్చిని పొడిచింది.

"క్... క్... క్!.."

"సైన్యాధ్యక్షా, పూటకూళ్ల యింట్లోకి యజమాని చూడకుండా లోపలికి వెడదామనుకున్నాను. నేను నీ అందమైన రంగు రంగుల తోక వెనక దాంకుంటాను. నన్ను తిన్నగా నెగడు దాకా తీసికెళ్లవూ? వూ" అన్నాడు.

"క్... క్!.." అని కోడిపుంజు యింకా గర్వంగా అరిచింది.

దానికి యేమీ అర్థం అవలేదు. కాని అది పూటకూళ్ల యింటి గుమ్మందాకా ఆడంబరంగా నడిచివెళ్లింది. తనకి అర్థం అయింది అని ప్రదర్శించుకోవడానికి అన్నట్టు నడిచింది. గుమ్మం తలుపు తీసే వుంది. బురతీనొ రెక్క కింద దాని డొక్క పట్టుకుని, తోక వెనక నక్కి, వంటింట్లోకి నెగడుదాకా వెళ్లాడు. అక్కడ తల బట్ట కడుతూ వున్న యజమాని హడావుడి పడిపోతున్నాడు. నెగడులో మంటని చువ్వలతో యెగసన దోస్తున్నాడు, పెనాలు తిరగేస్తున్నాడు.



"ఛవ్! అవతలకి ఫో! యెందుకూ పనికి రావు, చవటా" అని యజమాని కోడి పుంజుని తిడుతున్నాడు, గట్టిగా తన్నేడు. "దా... దారుణం!" అన్నట్టు మహా బెదురుగా అది అరిచింది. బయట వున్న కోడిపెట్టల దగ్గరికి యెగిరిపోయింది. అవి బెదిరిపోయి వున్నాయి.

బురతీనొ చడీచప్పుడు లేకుండా యజమాని కాళ్ల కిందనుంచి దాటేసి పెద్ద మట్టి జాడీ పక్క చేరాడు. సరిగ్గా అప్పుడు కరబాస్ బరబాస్, జలగల వైద్యుడు వస్తున్నారు. వాళ్ల గొంతుకలు బయటనుంచి వినిపించేయి.

బురతీనొ మట్టి జాడీలోకి దూరి అక్కడ దాంకున్నాడు.

# బురతీనో బంగారు తాళం రహస్యం కనిపెట్టడం

వేయించిన పంది పిల్ల మాంసం తిని కరబాస్ బరబాస్, జలగల వైద్యుడు పుంజుకున్నారు. యజమాని వాళ్ల గ్లాసుల నిండా సారా పోశాడు.

''యీ వైన్ చెత్తగా వుంది!'' అని కరబాస్ బరబాస్ పంది పిల్ల కాలు తింటూ యజమానితో అన్నాడు. ''అక్కడ జాడీలో వుందే, దాన్ని పట్రా'' అని బురతీనో దాంకున్న జాడీకేసి చూపించాడు.

''కాని అందులో యేం లేదండి, కాళీ'' అన్నాడు యజమాని.

''ఛవ్! చూపించు.''

యజమాని జాడీ యెత్తి తలకిందులుగా వొంపేడు. కింద పడకుండా వుండేందుకు గాను బురతీనో జాడీ అంచులకి శక్తి మేరకి గట్టిగా మోచేతులతో తాసుకున్నాడు.

''అక్కడేదో నల్లటిది వుంది'' అని కరబాస్ బరబాస్ బొంగురుగా అన్నాడు.

''అక్కడేదో తెల్లనిది వుంది'' అన్నాడు జలగల వైద్యుడు.

''అయ్యా! నే చెప్పింది నిజం కాకపోతే నా నాలిక పుచ్చిపోయి నేను పురుగులు పట్టిపోతాను. యీ జాడీ కాళీగా వుందండీ'' అన్నాడు.

''అలాగా! అయితే దాన్ని యీ బల్లమీద పెట్టు. ముడుసులు అందులో పడేస్తాం.''

బురతీనో లోపల వున్న జాడీని కరబాస్ బరబాస్‌కీ, జలగల వైద్యుడికీ మధ్యన పెట్టాడు యజమాని. చీకేసిన యెముకలు, పిప్పి బురతీనో తలమీద పడుతూనే వున్నాయి.

వైన్ బాగా తాగేక కరబాస్ బరబాస్ గడ్డాన్ని నెగడు ముందు పరిచేడు. గడ్డాన్ని అంటుకున్న జిగురు కరుగుతుందని అలా పెట్టేడు.

''నేను బురతీనోని నా అరిచేతిలో పెట్టుకుంటా'' అని గొప్పలు పోయేడు. ''రెండో చేతిని చరుస్తా — చెమ్మ మరక — అంతే బురతీనో పేరు చెప్పి మిగిలేదంతా'' అన్నాడు.

''నీచుడు. వాడికి అలాంటి శాస్తి కావాల్సిందే. కాని వాడి రక్తం అంతా పీల్చేసేందుగ్గాను ముందుగా వాడికి కొన్ని జలగల్ని తగిలించాలి'' అని వంత పలికాడు జలగల వైద్యుడు.

''వుహుం, ముందస్తుగా వాడి దగ్గర్నుంచి బంగారు తాళం సంపాదించాలి నేను'' అని ధనామని బల్లమీద మోదుతూ అన్నాడు కరబాస్ బరబాస్.

''అయ్యలారా!'' అంటూ యజమాని మాట కదలేశాడు. కొయ్య బొమ్మలు పారిపోవడం గురించి అతనికి అప్పటికే తెలుసు.

''వాళ్లని వెతుకుతూ మీరెందుకు ఆయాస పడిపోవాలి? నేను మెరికల్లాంటి కుర్రాళ్లని పిలు

స్తాను. మీరు కొంచెం వైన్ పుచ్చుకుని సేదదీరండి, యీ లోపున అడివి అంతా గాలించి బురతీనొని లాక్కొస్తారు'' అన్నాడు.

''బాగుందయితే, పంపించు'' అన్నాడు కరబాస్ బరబాస్, భారీ మడమల్ని మంటకేసి తిప్పుతూ. అతనికి బాగా మత్తు యెక్కడంతో గట్టిగా పాటలు మొదలుపెట్టాడు.

ఓహో! నాకడ పిచ్చి జనం
ఒకు మొద్దుతో చేశాం మనం
కీలుబొమ్మల అధినేత —
అంటే మనమే — ఉండొక్కింత.
భీకరమైన కరబాసూ
యెంతో ఘనమైన బరబాసూ!
అన్ని బొమ్మలూ వినయంగా
తుఫాను గాలికి గరికలులాగా
వొంచును శిరసులు కానంగా!
సరిగా వుండకపోతేనూ
కొరడాతోనూ మోదేనూ!
యేడు పేటల జాటీతో
టపటప నెత్తిన కొట్టుతా!
కొరడా దెబ్బకి అదరంగా
మా కొయ్య మొద్దులు వదరంగా
తెత్తురు కాసులు లోకులు
నిండును నావి జేబులు!

అప్పుడు లోపలినుంచి యెక్కణ్ణుంచో వచ్చినట్టు గొంతుక వినిపించింది.

''నీ రహస్యం కక్కు! నీచుడా!'' అని బురతీనొ జాడీ అడుగునుంచి అరిచేడు.

కరబాస్ బరబాస్‌కి చాలా ఆశ్చర్యం కలిగింది. చప్పుడు చేస్తూ దవడలు మూసుకుపోయేయి. గుడ్లు పెద్దవి చేసుకుని జలగల వైద్యుడికేసి చూశాడు.

''నువ్వేనా?''

''వుహుఁ, నేను కాదు!''

''యెవరు రహస్యం చెప్పమంటున్నది?''

జలగల వైద్యుడికి మూఢ నమ్మకాలు యెక్కువ. అతని ముఖం వివర్ణమైపోయింది, భయంతో ముడతలు పడిపోయింది. అతనికేసి చూస్తూ వుంటే కరబాస్ బరబాస్ పళ్లు పటపట కొట్టుకున్నాయి.

''నీచుడా! కక్కు రహస్యం!'' అని మళ్లీ కటువైన కంఠం జాడీ లోపలనుంచి వినిపించింది. ''లేకపోతే యెన్నటికీ కుర్చీలోనుంచి పైకి లేవవు!'' అంది.

కరబాస్ బరబాస్ గెంతబోయేడు కాని అసలు కూర్చున్న చోటునుంచి పిసరు కదలలేకపోయేడు.

''యే... యే... ర... హ... స్యం?'' అని నత్తేడు.

''తర్చిల తాబేలు రహస్యం'' అందా గొంతుక.

భయపడి పోయి జలగల వైద్యుడు బల్ల కింద దూరేడు. కరబాస్ బరబాస్ నోరు వెళ్లబెట్టేడు.

''ఆ తలుపు యెక్కడుంది? ఆ తలుపు యెక్కడుంది?'' అని ఆ గొంతుక అరిచింది. ఆకురాలు కాలం రాత్రి పొగగొట్టంలో గాలి హోరులాగా వుంది అది.

''చెప్తా, చెప్తా! చాలు! చాలు!'' అని కరబాస్ బరబాస్ గొణిగేడు. ''ఆ తలుపు ముసలి కార్లో లిక్కి గదిలో, ఉత్తుత్తి నెగడు వెనకాల వుంది!'' అన్నాడు.

ఆ మాటలు అన్నాడో లేదో యజమాని పెరట్లోనుంచి వచ్చేడు.

''యిరుగోనండి పట్టుకువచ్చా! కూలి యిస్తే గనక దెయ్యాన్నేనా తమ ముందు వుంచగల సరుకు!'' అన్నాడు. అలా అంటూ అతను గుమ్మం దగ్గర నుంచున్న నక్క అలీసనీ, పిల్లి బాసిలోనీ ముందుకి తోశాడు. నక్క పాత టోపీని గౌరవంగా యెత్తింది.

''శ్రీమాన్ కరబాస్ బరబాస్ మా పేదరికాన్ని కనికరించి పది కాసులు దయచేయిస్తే మేమా తుచ్ఛుడు బురతీనొని యెలా వున్న వాణ్ణి అలా వున్నట్టుగా పట్టుకొచ్చి అప్పగిస్తాం.''

కరబాస్ బరబాస్ గడ్డం కింద వెయిస్ట్ కోట్ జేబులో తడిమి పది బంగారు నాణేలు తీశాడు.

''యింద డబ్బు! బురతీనొ యెక్కడ?''

నక్క వొకటికి రెండు సార్లు డబ్బు లెక్కపెట్టుకుని, హుమ్మని, సగం పిల్లికి అందించింది.

''వాడు ఆ జాడీలో వున్నాడయ్యా, సరిగ్గా మీ ముందు'' అని జాడీకేసి చూపిస్తూ అంది.

కరబాస్ బరబాస్ బల్లమీదనుంచి జాడీని లాగేడు. దాన్ని ధనామని నేలకేసి కొట్టేడు. పగిలిన జాడీ పెంకుల్లోనుంచి, నమిలి పారేసిన యెముకల గుట్టలోనుంచి బురతీనొ యెగిరిగెంతేడు. అక్కడున్న వాళ్లంతా నోళ్లు వెళ్లబెట్టి చూస్తూ వుంటే అతను బాణంలాగా పెరట్లోకి దూసుకు పోయేడు. తిన్నగా కోడిపుంజుకేసి దూసుకు పోయేడు. అది గర్వంగా కాసేపు వో కంటితో, మరి కాసేపు మరో కంటితో వో పురుగుని పరీక్షగా చూస్తోంది. ఆ పురుగు చచ్చిందో బతికిందో మరి.

''నువ్వే నన్ను బయట పెట్టావు, కుళ్ళ కోడీ!'' అని బురతీనొ ముక్కు భీకరంగా వూపుతూ అన్నాడు. ''కానీ, గబగబా పరిగెత్తి తగలడు!'' అన్నాడు.

అతను ఆడంబరంగా వున్న దాని తోకని గట్టిగా పట్టుకున్నాడు. కోడిపుంజుకి యేమీ అర్థం అవలేదు. కాని అది రెక్కలు చాచి కాళ్ల బలం కొద్దీ పరిగెత్తింది. బురతీనొ దాని తోకని పట్టుకుని సుడిగాలిగా వూగేడు. కొండ దిగి, రోడ్డు దాటి, పొలాలమీదుగా అడివిలోకి పోయింది అది.

కరబాస్ బరబాస్, జలగల వైద్యుడు, పూటకూళ్ల యింటి యజమాని ఆశ్చర్యంనుంచి తేరుకుని బురతీనొని వెంబడించేరు. యెంత గాలించి చూసినా అతని జాడ కనబడలేదు. దూరంలో కోడిపుంజు మాత్రం కనిపించింది. ఆఘ మేఘాలమీద దూసుకు పోతోంది. అది యెంత మొద్దో అందరికీ తెలియబట్టి యెవళ్లూ దాన్ని గురించి పట్టించుకోలేదు.



## బురతీనొ జీవితంలో మొదటిసారిగా ఆశ వదులుకోవడం కాని అంతా సుఖాంతం కావడం

బడుద్ధాయి కోడిపుంజు చిత్తుగా అలిసిపోయింది. అది సరిగా పరిగెత్తలేకపోయింది. నోరు తెరిచింది. ఆఖరికి బురతీనొ ముడతలు పడిన దాని తోక వదిలేశాడు.

"సైన్యాధ్యక్షా! పరిగెత్తిపో! నీ పెట్టల దగ్గరికి!" అన్నాడు.

హంస సరస్సుకేసి బయల్దేరాడు. సరస్సు ఆకుల మధ్య తళతళ మెరుస్తోంది.

రాళ్ల కొండ పైన పైన్ చెట్టు అక్కడనే వుంది. గుహ అక్కడనే వుంది. చుట్టూతా పగిలిన కొమ్మలు చెల్లాచెదురుగా పడి వున్నాయి. గడ్డి బండి చక్రాల కింద నలిగిపోయింది.

బురతీనొ గుండె దడదడ కొట్టుకుంది. గుట్టమీదనుంచి కిందికి వురికేడు. మెలికలు పడిపోయిన చెట్టు వేళ్ల వెనకాల చూశాడు.

గుహ కాళీగా వుంది!

మల్వీనా జాడగాని, ప్యెరో జాడగాని, ఆర్తెమాన్ జాడగాని లేదు.

ఓ జత పాత గుడ్డ పీలికలు వున్నాయి, అంతే. అతను వాటిని తీశేడు. ప్యెరో కోటునుంచి చించినవి అవి.

తన మిత్రుల్ని యెవరో యెత్తుకుపోయేరు. తన మిత్రులు నాశనం అయిపోయేరు. బురతీనొ నేలమీద బోర్ల పడిపోయేడు. అతని ముక్కు నేలలో కంటా పోయింది.

తన మిత్రులు తనకి యెంత ప్రియమైన వాళ్లో యిప్పుడు మాత్రమే అతనికి అర్థం అయింది. మల్వీనా కనిపించిన వాళ్ల కల్లా చదువు చెప్ప బూనుకుంటే! ప్యెరో సర్న తన పద్య పఠనం పదే పదే చేస్తూ వుంటే! వాళ్లు కనిపించే మహా భాగ్యం లభిస్తే బంగారు తాళం యిచ్చెయ్యడానికి కూడా బురతీనొ తయారుగా వున్నాడు.



అతని తల పక్కనే దుమ్ము గుట్ట మెల్లిగా లేచింది. దానిలోనుంచి మఖమల్ బొచ్చు వున్న మోల్ జంతువు యివతలికి వచ్చింది. అది హాచ్ హాచ్ అంటూ మూడు సార్లు తుమ్మింది.

''నాకు కళ్లు కనిపించవు కాని బాగా వినిపిస్తుంది. వో బండి యిక్కడికి వచ్చింది. గొర్రెలు దాన్ని లాగుతున్నాయి. బదుద్దాయి నగరం గవర్నరు నక్క అందులో వుంది. దాని డిటెక్టివ్‌లు వున్నారు.

'' 'యీ తుంటరుల్ని పట్టుకోండి. వీళ్లు మా మేలైన పోలీసు కుక్కల్ని డ్యూటీలో వుండగా కొట్టేరు. పట్టుకోండి' అని ఆజ్ఞాపించేడు.

'' 'హూవ్' అని డిటెక్టివ్‌లు జవాబు చెప్పేరు.

''వాళ్లు గుహ లోపలికి చొచ్చుకుపోయేరు. అప్పుడు భయంకరమైన చప్పుడు అయింది. మీ స్నేహితుల్ని కట్టేసి మూటల్తో సహా బండిలో పడేసి తోలుకుపోయేరు.''

నేలలోకి ముక్కు పెట్టి పడుకోవడంవల్ల యేం లాభం? బురతీనొ యెగిరి గంతేసి బండి చక్రాల జాడ పట్టుకుని పరిగెత్తేడు. సరసు చుట్టి గుబురుగా గడ్డి వున్న మైదానంమీదకి వచ్చేడు.

అతను అలా వెదుతూనే వున్నాడు. అతని బుర్రలో ప్రత్యేకం యే ఆలోచనా లేదు. తన మిత్రుల్ని తను రక్షించాలి — అంతే.

ముందు రోజు రాత్రి యేటవాలుమీదనుంచి అదుక్కి తను పడిపోయిన చోటుకి వచ్చేడు. కింద వో మురికి చెరువు కనిపించింది. అక్కడ తర్చిల తాబేలు వుంటుంది. వో చిన్న బండి ఆ చెరువు వేపు వస్తోంది. రెండు గొర్రెలు దాన్ని లాగుతున్నాయి. అవి శల్యాల్లా వున్నాయి. వాటి బొచ్చు వూడిపోయింది.

బండితోలే వాళ్ల చోట్లో బూరి బుగ్గలతో లావుపాటి పిల్లి కూర్చుంది. అది బంగారు కళ్లజోడు పెట్టుకుంది. గవర్నరుగారి చెవులు కొరికే ముఖ్య అధికార స్థానం దానిది. దాని తర్వాత కూర్చుంది ముఖ్యమైన నక్క గవర్నర్. ఆ పక్కని మల్వీనా ప్యెరో వున్నారు. పక్కన ఆర్తెమాన్ వుంది. ఆర్తెమాన్ వొళ్లంతా కట్లతో వుంది. మూట్లమీద కూర్చున్నారు ప్యెరో, మల్వీనా. ఆర్తెమాన్ కూడా అలానే పడివుంది. యెప్పుడూ యెంతో బాగా దువ్వి వుండే ఆర్తెమాన్ తోక దుమ్ములో యీడ్చుకుపోతోంది.

బండి వెనక్కాల డిటెక్టివ్ వేట కుక్కలు రెండు వున్నాయి.

హఠాత్తుగా డిటెక్టివ్ కుక్కలు మూతులు పైకి పెట్టి కొండపైన బురతీనొ చిన్న తెల్ల టోపీని చూశాయి.

నిట్రటగా వున్న కొండపైకి ఆ వేట కుక్కలు ఉరుకులు పరుగులమీద యెక్కడం మొదలుపెట్టాయి. అవి పైకి వెళ్లేయి. బురతీనొకి దాంకునే చోటు గాని, పారిపోయే చోటు గాని లేదు. దాంతో అతను చేతులు పైకి యెత్తి బాగా నిట్రటగా వున్న చోటునుంచి ఆకుపచ్చ కలుపు మొక్కలు బాగా పెరిగిపోయిన చెరువుకేసి సర్న దూకేడు.

గాలిలో వో చక్కెర కొట్టేడు. తర్చిల అత్తయ్య అభయ హస్తం మాటున హాయిగా దిగి వుండే వాడే, కాని గాలి గట్టిగా వూపుతో వీచింది.

చెక్కతో తయారై తేలిగ్గా వున్న బురతీనొని గాలి యెగరేసుకుపోయింది. సుళ్లు తిప్పి రెండు సార్లు తలకిందులు చేసింది. అతని డొక్కలకి కొట్టుకుంది. ఆ దెబ్బకి అతను ధనామని బండిలో గవర్నరుగారి నెత్తిమీద పడ్డాడు.

బంగారు కళ్లజోడు పెట్టుకున్న లావుపాటి పిల్లికి దిమ్మ తిరిగిపోయింది. అది కూర్చున్న చోటునుంచి కింద పడింది. దుష్టస్వభావమూ, పిరికతనమూ వున్నదవడంతో స్పృహ తప్పినట్టు నటించింది.

గవర్నరు నక్క కూడా శుద్ధ దొంబులిగొడ్డు. అది కుంయో మొర్రోమంటూ అరుస్తూ నిట్రటగా వున్న కొండమీదకి యెక్కి వో బాడ్జర్ బొరియలో దూరింది. అది బయటికీ రాలేదు. అలాంటి అతిథులకి బాడ్జర్లు చురక మర్యాద చేస్తాయి.



గొర్రెలు బెదిరిపోయేయి.

బండి తిరగబడింది. మల్వీనా ప్యెరో మూటలతో సహా దొర్లి గచ్చపొదల్లో పడ్డారు. ఆర్తెమాన్ కూడా పడింది.

యిదంతా యెంత గబగబా జరిగిందంటే, ప్రియ పాఠకా, చేతి వేళ్లు లెక్క పెట్టే వ్యవధి కూడా మీకు వుండదు.

వేట కుక్కలు పెద్ద పెద్ద అంగలతో చీల్చుకుంటూ కొండమీదనుంచి వచ్చేశాయి. తిరగబడిన బండి దగ్గరికి వచ్చేటప్పటికి వాటికి మూర్ఛపోయిన పిల్లి కనిపించింది. కొయ్య బొమ్మలు, బేండేజీ కట్టుకున్న కుక్క అక్కడ చిందర వందరగా పడిపోయి గచ్చపొదల్లో కనిపించేయి. కాని గవర్నరు నక్క మాత్రం యెక్కడా కనిపించలేదు.

తమ కంటిపాపలా కాపాడుకోవాల్సిన వాడు ఆ డిటెక్టివ్‌లకి కనిపించలేదు. భూమి తెరుచుకుని వాళ్లని మింగేసినట్టుగా అయింది.

అవి దూసుకుపోయి మొత్తం కొండ అంతా వెతికేశాయి. మరోసారి విచారంగా కుంయోమ న్నాయి. యేమంటే వాటికి కళ్ల ముందు కొరడాలూ, జైలు కమ్మీలూ కనిపిస్తున్నాయి.

వాటి వెనక కాళ్ల వూగేయి, అవి బడుద్దాయి నగరానికి దూసుకుపోతూ వుంటే. యిక చేసేది లేక గవర్నరుగారిని బొందితో కైలాసం తీసుకుపోయారని పోలీసు స్టేషన్లో గొప్పలు చెప్పాలని అనుకు న్నాయి. యిక తమకి అదే సాకు దొరికిందని అవి దారిలో ఆలోచన చేశాయి.

తనకి యేం హాని జరగలేదని బురతీనొకి అనిపించింది. అతని కాళ్లూ చేతూలూ యేం దెబ్బ తినలేదు. అతను పాక్కుంటూ వెళ్లి మల్వీనానీ ప్యెరోనీ కట్టిన తాళ్లని విప్పేడు.

మల్వీనా వొక్క మాట కూడా అనకుండా బురతీనొ మెడ వాటేసుకుంది. కాని ముద్దుపెట్టుకో లేకపోయింది. అతని ముక్కు అడ్డం వచ్చింది.

ప్యెరో చొక్కా మోచేతుల దగ్గర చిరిగిపోయింది. అతని బుగ్గలమీదనుంచి తెల్ల పౌడరు వూడి పోతోంది. అతనికి సరస శృంగార కవితా ధోరణి యెంత వున్నా అతని బుగ్గలు మామూలు గులాబీ బుగ్గలని, వెల్లడైంది.

''యెంత గట్టిగా యుద్ధం చేశాను!'' అది అతను బొంగురుగా అన్నాడు. ''వాళ్ల గనక నన్ను కిందికి పడెయ్యకుండా వుంటే అసలు నన్ను పట్టలేకపోయి వుండేవాళ్లు'' అన్నాడు.

''సింహంలాగా పోరేడు'' అని బలపరిచింది మల్వీనా.

ఆమె అతన్ని వాటేసకుని రెండు బుగ్గలమీదా ముద్దుపెట్టుకుంది.

''చాలు, ఆ ముద్దులు చాలు. పదండి పోదాం. ఆర్తెమాన్ తోక పుచ్చుకుని యీడ్చుకు పోదాం'' అన్నాడు బురతీనొ.

ఆ ముగ్గురూ పాపం దురదృష్టవంతురాలైన ఆ కుక్కని తోక పట్టుకుని కొండ వారకి యీడ్చుకుపోయేరు.

''వదిలెయ్యండి!'' అని ఆ కుక్క మూలిగింది. ''చాలా అమర్యాదగా వుందిది. నా అంతట నేనే నడుస్తా'' అంది.

''అబ్బే వద్దు వద్దు, నీకు చాలా నీరసంగా వుంది.''

కాని వాళ్ల నిట్రపాటి కొండమీదకి సగం యెక్కేరో లేదో పైన కరబాస్ బరబాస్, జలగల వైద్యుడు కనిపించేరు. అలీస నక్క పంజాతో వీళ్లకేసి చూపిస్తోంది. బాసిలో పిల్లి మీసాలు సాగదీసి ఆడిసూ క్రూరంగా గీమంటోంది.

''హ! హ!'' అని కరబాస్ బరబాస్ వికటాట్ట హాసం చేశాడు. ''తెలివి బాగుంది కదూ! తనంతట తనే బంగారు తాళంతో నా వొళ్లోకి వచ్చి పడుతున్నాడు'' అన్నాడు కరబాస్ బరబాస్.

జలగల వైద్యుడు కొండపైన హిహిహీ అని వెక్కిరిస్తూ నవ్వుతున్నాడు.

"కరబాస్ బరబాస్‌గారూ! నాకా జబ్బు కుక్కని వదలండి. దాన్ని చెరువులో జలగల కోసం వదిలి పెడతాను. జలగలు బలుస్తాయి."

కరబాస్ బరబాస్ బాగా లావు. కిందికి దిగలేనంత వాళ్ళు వొంగని మనిషి. దాంతో రూళ్ల కర్రలాగా వున్న వేలితో వాళ్లని రమ్మని సైగ చేశాడు.

"రండి, రండి! నా బుజ్జి పిల్లలూ."

"దిగులు పడకండి! చావు రాసిపెట్టి వుంటే నవ్వుతూ చచ్చిపోదాం. ప్యెరో, నీ పరమ చెత్త పద్యాలు చదువు. మల్వీనా, పగలబడి నవ్వు" అని బురతీనొ ఆజ్ఞాపించేడు.

కొన్ని లోటు పాట్లు వున్నా మల్వీనా మంచి తోడు. ఆమె కన్నీళ్లు తుడిచేసుకుని, కొండ పైన నుంచున్న వాళ్లని చాలా హేళన చేసే ధోరణిలో నవ్వింది.

ప్యెరో ఆశువుగా పద్యాలు కూర్చేడు. తార స్థాయిలో వాటిని చదివేడు.

అలీస నక్కా నీ నెత్తిమీద
మొట్టికాయలు నే మొత్తిపోదు
బాసిలో పిల్లీ దొంగవి, ముష్టివి
ఓ చెత్త పిల్లీ పడుదువు కష్టం

జలగల వైద్యుడా, శుంఠా చవటా
అబ్బా! చూడండి, యితని మొహం అకటా,
కరబాస్, అబ్బా! ఓ! బరబాస్!
నువ్వంటే యెవరికి బెదురు పోరోస్!

బురతీనొ కొంటె కోణంగి చేష్టలు చేస్తూ, వెక్కిరిపిస్తూ, యేడిపిస్తూ అరిచేడు.

"హేయ్! కొయ్య బొమ్మల థియేటర్ డైరెక్టరూ! సారా పీపా! కొవ్వు బలిసిన చవటా! రా! రా! నీ గడ్డంమీద ఉమ్ముతా."

కరబాస్ బరబాస్ భీకరంగా బుసకొట్టేడు. జలగల వైద్యుడు యీను పుల్లల్లా వున్న చేతుల్ని పైకి యెత్తేడు.

అలీస నక్క జిడ్డు మొహం వేసుకు యేవగింపుగా చూసింది.

"వీళ్ల మెళ్లు నులిమెయ్యనా? తుంటరి వెధవలు!"

మరో క్షణంలో అంతా అయిపోయింది. సర్‌న స్విఫ్ట్ పిట్టలు దూసుకు వచ్చేయి.

"యెదుగో! యిదిగో! వచ్చేం! వచ్చేం!"

యేటవాలుగా వున్న కొండపైన డాడీ కార్లో కనిపించేడు. అతను చొక్కా చేతులు మడుచుకు న్నాడు. చేతిలో ములుకర్ర వుంది. కోపంగా వున్నాడు.

అతను కరబాస్ బరబాస్‌ని భుజంతో పొడిచేడు. జలగల వైద్యుణ్ణి మోచేత్తో పొడిచేడు. కొరడా వూపేడు. అలీస వీపుమీద మోదేడు. కాలితో బాసిలో పిల్లిని తన్నేడు. అది దెబ్బకి యెగిరిపోయింది.

ఆ తర్వాత అతను వొంగి కొయ్య బొమ్మలు వస్తూ వున్న వేపు చూశాడు.

''బురతీనొ, బాబూ!'' అని సంతోషంతో అరిచేడు. ''బాగున్నావా! పిచ్చి కుంకా! రా! రా! గబగబా!'' అన్నాడు.



## ఆఖరికి బురతీనొ డాడీ కార్లో, మల్వీనా, ప్యెరోలతో ఆర్తెమాన్‌తో కలిసి యింటికి తిరిగిరావడం

అనుకోకుండా కార్లో రావడంతో, అతని కొరడా, కోపం చూసి ఆ దుష్టుల గుండెలు గుభిల్లు మన్నాయి.

అలీస నక్క గుబురుగా వున్న గడ్డిలోకి పాకిపోయింది. అక్కడినుంచి కాలికి బుద్ధి చెప్పింది. కొరడా దెబ్బ నొప్పికి నడుం చాచడానికి మధ్య మధ్య ఆగింది.

బాసిలో పిల్లి పదడుగులు యెగిరిపోయింది. కసిదీరా బుస్‌మంది, చిల్లుపడిన టైర్‌లాగా.

జలగల వైద్యుడు వోవరు కోటు అంచులు పట్టుకుని యేటవాలుమీదుగా కిందికి దిగేడు.

"అయ్య బాబోయ్! దీంతో నాకేం సంబంధం లేదు! నాకేం సంబంధం లేదు" అని అరుస్తూనే వున్నాడు.

చాలా ప్రమాదంగా వుండే చోట జారి దొర్లి పడిపోయేడు. అతను జారి అలా చెరువులో పడిపోతూ వుంటే పెద్ద చప్పుడు అయింది.

కరబాస్ బరబాస్ యెక్కడి వాడక్కడే నుంచుండిపోయేడు. తల భుజాల కిందికి దించేసుకున్నాడంతే. అతని గడ్డం తాళ్ల మూటలా వేలాడింది.

బురతీనొ, ప్యెరో, మల్వీనా పైకి యెక్కేరు. డాడీ కార్లో వరసగా అందర్నీ చేతులతో యెత్తుతూ పేరు పేరునా పలకరించి మాట్లాడేడు.

"యిప్పటికి దొరికేరు. కొంటె పిల్లలూ!" అని వాళ్లని కోటులో దోపుకున్నాడు.

అప్పుడు యేటవాలుగా వుండే చోటుమీదుగా కొంచెం దూరం దిగి దురదృష్టం పాలబడిన కుక్కమీదకి వొంగేడు. విశ్వాసపాత్రంగా వుండే ఆర్తెమాన్ ముట్టె పైకి యెత్తి కార్లో ముక్కు నాకింది. బురతీనొ కోటు కిందనుంచి తల యివతలకి పెట్టేడు.

"కుక్క లేకుండా మేం యింటికి రాం, డాడీ కార్లో."

"అయ్యో! కష్టం వెళ్లడం. సరే కానీ లే. యెలాగో వీపుమీద యెక్కించుకుని నడుస్తాను" అన్నాడు కార్లో.

ఆర్తెమాన్‌ని భుజంమీద యెక్కించుకున్నాడు. బరువుకి ఆయాసపడిపోతూ కరబాస్ బరబాస్ నుంచున్న చోటుకి వెళ్లేడు. కరబాస్ బరబాస్ తల వేలేసుకున్నాడు. అతని గుడ్లు పైకి పొడుచుకు వచ్చేయి.

"అవి నా కీలుబొమ్మలు" అని అతను గొణిగేడు.

''ఛవ్! నువ్వా!'' అని డాడీ కార్లో కటువుగా అన్నాడు. ''ముసలాళ్లు బాగా కలిశేరు! పేరు మోసిన తిక్క వెధవలు! జలగల వైద్యుడు, పిల్లి, నక్క! పాపం యీ చిన్ని వాళ్లని గాయపరుస్తారా! సిగ్గు! సిగ్గు! డాక్టరూ!'' అన్నాడు.

అలా తిట్టిపోసి కార్లో బస్తీ దారి పట్టేడు.

తల భుజం మధ్య వేలాడేసుకుని కరబాస్ బరబాస్ అతని వెనకాలే వెళ్లేడు.

''నా కీలుబొమ్మల్ని నాకిచ్చెయ్యి.''

''లేదు. యివ్వద్దు యివ్వద్దు'' అని బురతీనొ తల కోటు యివతలకి పెట్టి అరిచేడు.

వాళ్లు ముందుకు సాగేరు. ''మూడు చేపల'' పూటకూళ్ల యిల్లు దాటి వెళ్లేరు. అక్కడ బట్ట తల యజమాని వొంగి వందనం చేశాడు. గుమ్మంలో నుంచుని పొయ్యిమీద కాలే పెనాలకేసి సైగ చేశాడు. గుమ్మం దగ్గర రేగిపోయిన తోకతో కోడిపుంజు యిటూ అటూ తిరుగుతూ వుంది. బురతీనొ రౌడీ ప్రవర్తన గురించి కోపంగా సూచిస్తూనే వుంది. కోడిపెట్టలు సానుభూతి పూర్వకంగా వత్తాసు పలికేయి.

''అయ్యో! అయ్యో! యెంత దారుణం! మన పుంజుని చూడండి.''

కార్లో మిట్టమీదకి వెళ్లాడు. అక్కణ్ణుంచి సముద్రం కనిపిస్తుంది. సముద్రంమీద అలలు వీస్తూ వుంటే నిస్తేజ రేఖలు గోచరించాయి. తీరంమీద యెర్రటి యెండలో యిసికరంగు పాత వూరు, కీలుబొమ్మల థియేటరు గుడారం కనిపించేయి.

''ఆ కీలుబొమ్మల్ని యిచ్చేస్తే వంద బంగారు నాణేలు ముట్ట చెపుతా. అమ్మెయ్యి'' అని కరబాస్ బరబాస్ కార్లో వెనక్కాల మూడడుగుల దూరంలో నుంచుని గొణిగేడు.

కార్లో యేమంటాడోనని బురతీనొ, మల్వీనా, ప్యెరోలు ఉగ్గపట్టుకు వున్నారు.

''వీల్లేదు'' అన్నాడు కార్లో. ''నువ్వు మంచిగా జాలిగా వుండే డైరెక్టరు వయితే వీళ్లని నీకు యిచ్చి వుండేవాణ్ణి గొడవా గొష్టా లేకుండా. కాని నువ్వు మంచి వాడివి కాదు. మొసలికంటే అధముడివి. నేను వీళ్లని యివ్వను. అమ్మను. వెళ్లిపో'' అన్నాడు.

కార్లో గుట్ట దిగి వెళ్లేడు. కరబాస్ బరబాస్ గురించి పట్టించుకోలేదు. వూళ్లోకి వెళ్లేడు.

కాళీగా వున్న చౌకులో వో పోలీసు కదలకుండా నుంచున్నాడు.

యెండకీ, విసుక్కీ అతని మీసాలు వాలిపోయేయి. కనురెప్పలు అంటుకుపోయేయి. అతని టోపీ చుట్టూ యీగలు మూగేయి.

హఠాత్తుగా కరబాస్ బరబాస్ గడ్డాన్ని జేబులో దోపేసి వెనకనుంచి కార్లో చొక్కా పట్టుకుని చౌకులో అరవడం మొదలుపెట్టేడు.

“దొంగని అరెస్టు చెయ్యండి. నా కీలుబొమ్మలి కాజేశాడు” అని అరిచేడు.

కాని అలిసిపోయి విసుగ్గా వున్న పోలీసు వొక్క పిసరు కూడా కదల్లేదు. కరబాస్ బరబాస్ అతని దగ్గరికి గెంతుకుంటూ పోయి, కార్లోని అరెస్టు చెయ్యమని గట్టిగా అరిచేడు.

“యెవరయ్యా నువ్వు?” అని పోలీసు బద్ధకంగా అడిగేడు.

“నేను కీలుబొమ్మల గురించిన తెలిసిన పండితుణ్ణి, ప్రఖ్యాత థియేటర్‌కి డైరెక్టర్ని, నాకు చాలా పతకాలు వచ్చేయి. మంబొజంబో రాజుగారు నా నేస్తం. నన్ను శ్రీమాన్ కరబాస్ బరబాస్ అంటారు —”

“అలా చించుకోకు” అన్నాడు పోలీసు.

కరబాస్ బరబాస్ అతనితో అలా గొడవ పడుతూ వుండగా డాడీ కార్లో గబగబ ముందుకు పోయేడు. రోడ్డుమీద పరిచిన రాళ్ల పైన చేతి కర్రతో టకటకమంటూ కొడుతూ నడిచేడు. అలా నడిచి తన యింటికి చేరేడు. మెట్లకింద మసక చీకటిగా వున్న లిక్కి గది తలుపు తెరిచేడు. భుజం మీదనుంచి ఆర్తెమాన్‌ని దింపి మంచంమీద పడుకోబెట్టాడు. కోటు జేబులోనుంచి బురతీనొని, మల్వీనాని, ప్యెరోని తీసి వరసగా బల్లమీద కూర్చోబెట్టాడు.

“డాడీ కార్లో! ముందు కుక్క సంగతి చూడండి. దానికి వొంట్లో బాగా లేదు. అబ్బాయిలూ, వెళ్లి వెంటనే ముఖం కాళ్లూ చేతులూ కడుక్కోండి” అంది మల్వీనా.

వున్నట్టుండి ఆమె నిరాశగా చేతులు పైకి విసిరింది.

“అయ్యో నా బట్టలు! సరికొత్త చెప్పులు! ముచ్చటైన రిబ్బన్లు! అవన్నీ ఆ కనుమలో పొదల మాటున వుండిపోయాయి” అంది.

“ఫర్లేదులే, బెంగపడకు! నే వెళ్లి మీ మూటలు సాయంత్రం తెచ్చి పెడతా” అన్నాడు కార్లో.

కార్లో జాగ్రత్తగా ఆర్తెమాన్ బేండేజీలు విప్పేడు. దాని గాయాలు మానినట్టే వుంది. కుక్క కదలకపోవడానికి కారణం తిండిలేక మాడుతూ వుండడమే.

“వో కంచంనిండా గంజి, వో యెముక ముక్క! అంతే! వూళ్లో అన్ని కుక్కల్తో దెబ్బలాడే శక్తి నాకు వచ్చేస్తుంది” అని ఆర్తెమాన్ గొణిగింది.

“అయ్యో! అయ్యో! యింట్లో మెతుకు లేదు, జేబులో పైసా లేదు” అని కార్లో యెంతో నిరాశ పడిపోయి అన్నాడు.

మల్వీనా జాలి పుట్టేటట్టు వెక్కింది. ప్యెరో నుదురు రుద్దుకున్నాడు. గట్టిగా ఆలోచించేడు.

“నేను వీధిలోకి వెళ్లి కవిత్వం చదువుతాను. దారమ్మట పోయేవాళ్లు కానీ పరకా పడేస్తారు” అన్నాడు.

కార్లో తల వూపేడు లాభం లేదన్నట్టు.

''అల్లరిగా వున్నావని జైల్లో పడేస్తారు, నాయనా'' అన్నాడు.

అందరూ నిరుత్సాహ పడిపోయేరు, బురతీనొ తప్ప. అతను కొంటెగా యికిలించేడు. కాని బల్ల మీద కాక తల కిందులుగా పెట్టిన తలుపు గుబ్బమీద కూర్చున్నట్టు తిరిగేడు.

''వొట్టినే రొజ పెట్టకండ్రా'' అంటూ కిందికి గెంతి జేబులోనుంచి యేదో తీశేడు. ''డాడీ కార్లో, నీ సుత్తి తీసుకురా, గోడమీద వున్న యీ చింకి కాన్వాస్‌ని చీల్చు'' అన్నాడు.

పొడుగాటి ముక్కుతో ఉత్తుత్తి పొయ్యి, పొగ, వంట పాత్ర గీసిన కాన్వాస్‌కేసి చూపించేడు.

కార్లో ఆశ్చర్యపోయేడు.

''యింత అందమైన బొమ్మని యెందుకు పీకెయ్యమంటావ్ నాయనా! దీనికేసి శీతాకాలంలో చూసి నిజమైన నెగడు అనీ, అక్కడ వుడికేదీ నిజమైన భోజనం అనీ అనుకుంటూ వుంటాను. దానితో నాకు వెచ్చగా అనిపిస్తుంది'' అన్నాడు.

''డాడీ కార్లో! నే బొమ్మనే అయితే నిజంగా వొట్టేసి చెపుతున్నా — నీకు నిజమైన నెగడు, యినపవంట పాత్రా, వేడివేడి భోజనం వస్తాయి. దాన్ని పీకెయ్యి!'' అన్నాడు.

బురతీనొ చాలా గట్టి ధైర్యంతో మాట్లాడేడు. దాంతో డాడీ కార్లో మెడ బరుక్కుని, తల వూపి, ముక్కి మూలిగేడు. కత్తెరా, సుత్తీ తీసుకుని కాన్వాస్‌ని చీల్చడం మొదలుపెట్టేడు. మనకి తెలుసు కదా, వెనక్కాల సాలెగూళ్ళు వున్నాయి. చచ్చిన సాలెపురుగులు వాటిమీద వేలాడుతున్నాయి.

కార్లో వాటిని జాగ్రత్తగా వూడ్చేడు. అక్కడ వో చిన్న తలుపు కనిపించింది. అది ఓకు తలుపు. నల్లబడిపోయింది. దాని నాలుగు మూలల్లోనూ నవ్వే ముఖాలు చెక్కి వున్నాయి. మధ్యలో పొడుగాటి ముక్కుతో వో చిన్నాడు నాట్యం చేస్తూ వున్న బొమ్మ చెక్కి వుంది. దుమ్ము దులిపేక యిదంతా కనిపించింది.

''అది బురతీనొ బొమ్మ కాదూ'' అని మల్వీనా అరిచింది. ప్యెరో, డాడీ కార్లో అందరూ వొక్క సారే అలా అరిచేరు. ఆర్తెమాన్ కూడా అరిచింది.

''నాకూ అలానే అనిపించింది'' అన్నాడు బురతీనొ. నిజానికి అతను అలా యేమీ అనుకోలేదు, తనే ఆశ్చర్యపోయేడు. ''యిదిగో ఆ చిన్న తలుపు తాళం. తెరు, డాడీ కార్లో'' అన్నాడు.

''యీ చిన్న తలుపూ, యీ బంగారు తాళం యేనాటివో. యెవరో చెయ్యి తిరిగిన పనివాడు వీటిని చేశాడు. యేదీ చూద్దాం తలుపు వెనక యేం వుందో'' అన్నాడు.

తాళం చెవి పెట్టి తిప్పేడు. కమ్మని శ్రావ్యమైన సంగీతం వినిపించింది. అది సంగీతం పెట్టె లాగా అనిపించింది.

డాడీ కార్లో తలుపు తోశేడు. కీచుమంటూ అది తెరుచుకుంది.

సరిగ్గా అప్పుడే హడావుడిగా నడుస్తూ వున్న అడుగుల చప్పుడు కిటికీ బయటనుంచి విని పించింది.

''మంబొజంబో రాజుగారి ఆజ్ఞ మేరకి యీ తుచ్ఛుడు కార్లోని అరెస్టు చెయ్యండి'' అని కరబాస్ బరబాస్ అరిచిచేడు.



# మెట్లకింద వున్న లిక్కి గదిలోకి
# కరబాస్ బరబాస్ చొరబడి వెళ్లడం

కార్లోని అరెస్టు చేసేటట్టు నిద్రమగతగా వున్న పోలీసుని బలవంతం చేసి, చాలా బతిమాలి బామాలి శ్రమ పడ్డాడు కరబాస్ బరబాస్ అనే సంగతి మనకి తెలుసు. కాని కరబాస్ బరబాస్ నెగ్గ లేకపోయేడు. దాంతో తన దారిన పరిగెత్తేడు.

అతని గడ్డం అన్ని వేపులకీ చెదిరిపోయి దారినపోయేవాళ్ల బొత్తాల్లో గొడుగుల్లో యిరుక్కుంటూ వుంది. అతను పక్క వాళ్లని తోసుకుంటూ పళ్లు పటపట కొరికేడు. పిల్లలు అతని వెనక్కాల గీమంటూ యీలలు వేశారు. కుళ్లిన ఆపిల్ పళ్లని అతని వీపుమీదకి విసిరేరు.

కరబాస్ బరబాస్ ఆ టౌను మేయర్ని చూడ్డానికి పరిగెత్తి వెళ్లేడు. వేడిగా వున్న ఆ సమయంలో మేయరు తోటలో వో ఫౌంటెన్ దగ్గర పొట్టి నిక్కరు మాత్రం తొడుక్కుని నిమ్మరసం తాగుతూ కూర్చున్నాడు.

మేయరు చుబుకం ముడతలు ముడతలుగా ఆరు ముడతలు పడిపోయింది. అతని నాసిక యెర్రటి బుగ్గల మధ్య వొత్తుకుపోయింది. అతని వెనకాల లైమ్ చెట్టుకింద మబ్బు ముఖాల పోలీసులు నలుగురు నుంచుని, పట్టు పట్టుకీ నిమ్మరసం సీసాల మూతలు తెరుస్తూనే వున్నారు.

కరబాస్ బరబాస్ దూసుకుంటూ వచ్చి మేయరు ముందు మోకాళ్లమీద పడ్డాడు.

''నేనో బీద అనాధని'' అని ముఖం అంతా గడ్డంతో కన్నీళ్లని తడుపుతూ విలపించేడు. ''నన్ను అవమానం పాలు చేశారు, దోచేశారు, కొట్టేరు —''

''యెవరు నిన్ను అవమానించేరు, అనాధా'' అని గసపెడుతూ అడిగేడు మేయరు.

''చాలా ఘోరమైన శత్రువు, ముసలి ఆర్గన్ గ్రైండర్ కార్లో. అతను నా ఒకటోరకం కీలు బొమ్మల్ని మూడింటిని కాజేశాడు. నా ప్రఖ్యాత థియేటర్‌ని తగలబెడదా మనుకుంటున్నాడు. వున్న పళంగా అతన్ని అరెస్టు చేయించకపోతే మొత్తం పట్టణాన్ని దోచేసి తగలెట్టేస్తాడు.''

తను చెప్పిన దానికి బలం కలిగేందుకు జేబులోనుంచి వో గుప్పెడు బంగారు నాణేల్ని తీసి మేయరు చెప్పు లోపల పెట్టేడు.

సూక్ష్మంగా చెప్పాలంటే శుద్ధ అబద్ధాలు చెప్పాడు. తెగ అబద్ధం ఆడేడు. దాంతో మేయరు బెదిరిపోయేడు.

''యీ యోగ్యుడైన అనాధతో వెళ్లండి'' అని లైమ్ చెట్టుకింద వున్న పోలీసులకి ఆజ్ఞా పించేడు. ''చట్టపరంగా అవసరం అయిన చర్యలు తీసుకోండి'' అన్నాడు.

కరబాస్ బరబాస్ ఆ నలుగురు పోలీసులతోనూ కార్లో లిక్కి గదికి వెళ్ళేడు.

"మంబొజంబొ రాజుగారి ఆజ్ఞ మేరకి యీ తుచ్ఛుణ్ణి అరెస్టు చెయ్యండి" అని అరిచేడు.

కాని తలుపులు మూసుకుపోయేయి. లోపలినుంచి యేం జవాబు రాలేదు.

"మంబొజంబొ రాజుగారి ఆజ్ఞ మేరకి తలుపు బద్దలు గొట్టండి" అని కరబాస్ బరబాస్ ఆజ్ఞ చేశాడు.

పోలీసులు ఐసలబొజ్జ అంటూ ఢీకొట్టేరు. జమిలి తలుపులు చివికిపోయి పాత బడ్డవి. అవి ఉతకలమీద కిర్రుమని చప్పుడు చేస్తూ భళ్ళున తెరుచుకున్నాయి. పోలీసులు కత్తులు వూపుతూ మెట్ల కింద వున్న ఆ లిక్కి గదిలో ధనామని దొర్లిపడ్డారు.

కార్లో పరుగులు తీస్తూ రహస్య ద్వారంగుండా లోపలికి వెళ్లిన క్షణంలో యిది జరిగింది. ఆఖర్న అలా లోపలికి వెళ్లిన వాడు అతనే.

ధనామని తలుపు మూసుకుంది. సంగీతం ఆగిపోయింది. పాత బేండేజీలు, చింపేసిన కాన్వాస్ గుడ్డ ముక్కలూ అక్కడ మిగిలేయి.

కరబాస్ బరబాస్ ఆ చిన్న తలుపు దగ్గరికి వొక్క ఉదుటన్న పోయి పిడికిలితో, మడమలతో మోదడం, తన్నడం మొదలుపెట్టేడు.

"ఠకా! ఠకా! ఠకా!"

కాని ఆ చిన్న తలుపు గట్టిగా బిగిసి మూసుకుంది.

కరబాస్ బరబాస్ తలుపు దగ్గరికి పరుగు తీసి వెళ్లి గట్టిగా మోదేడు కాని తలుపు బెసకలేదు.

"మంబొజంబో రాజుగారి ఆజ్ఞ మేరకి యీ దరిద్రపు గొట్టు తలుపు బద్దలు కొట్టండి!"

పోలీసులు బొప్పులు తడిమి చూసుకున్నారు. వొకడికి ముక్కుమీద బొప్పి కట్టింది. యింకొకడికి నెత్తిమీద బొప్పి కట్టింది.

"వుహుం! యిది చాలా కష్టం" అని వాళ్లు జవాబు చెప్పి, చట్ట ప్రకారం తాము అన్నీ చేసినట్టు మేయరుకి నివేదించుకుందుకు వెళ్లిపోయేరు. దయ్యమే ఆర్గన్ గ్రైండర్‌కి సాయితా వుందనీ, అతను గోడలో దూరి మాయమైపోయేడనీ నివేదించాలని మేయరు దగ్గరికి వెళ్లిపోయేరు.

కరబాస్ బరబాస్ గడ్డం పీక్కున్నాడు. నేలమీద పడ్డాడు. పిచ్చివాడిలా దొర్లడం అరవం మొదలు పెట్టేడు. ఆ మెట్లకింద వున్న లిక్కి గది అంతా దొర్లిపొర్లి అల్లరి చేశేడు.

# రహస్యద్వారం వెనక వాళ్లకి కనిపించిన విశేషం

యిక్కడ కరబాస్ బరబాస్ అలా గడ్డం పీక్కుని పిచ్చివాడిలా దొర్లుతూ వుంటే లోపల నిట్ట పాటి రాతి మెట్లమీదనుంచి వాళ్లు కిందికి దిగుతూ వున్నారు. బురతీనొ ముందు వున్నాడు. వెనక మల్వీనా, ప్యెరోలు వున్నారు. ఆ వెనక ఆర్తెమాన్ వుంది. ఆఖర్న డాడీ కార్లో వున్నాడు. ఆ మెట్లు భూగృహంలోకి వెడుతున్నాయి.

డాడీ కార్లో చేత్తో వో కొవ్వొత్తి పట్టుకున్నాడు. అది మిణుకు మిణుకు మంటూ వెలుగుతోంది. పెద్ద పెద్ద నీడలు ఆ వెలుతురులో పడుతున్నాయి. కాసేపు ఆర్తెమాన్ బొచ్చు తల నీడ, కాసేపు ప్యెరో చాచిన చెయ్యి నీడ పడుతున్నాయి. కాని మెట్లమీద చీకటి చీకటిగానే వుండిపోయింది, దీపం వెలుతురు చాలడం లేదు.

భయంతో అరవకుండా వుండేందుకు గాను మల్వీనా తన చెవులు గిచ్చుకుంది.

బురతీనొ మిగిలిన వాళ్లకంటే ముందు వెళ్లేడు. కోసుగా చాలా దిగువగా వున్న తెల్లని టోపీ సరిగా కిందనుంచి ఆనటం లేదు.

హఠాత్తుగా కిందనుంచి బుస్‌మన్న చప్పుడు వినిపించింది. యేదో పడి దొర్లింది.

"రక్షించండి! సాయం చెయ్యండి!" అని మాటలు వినిపించేయి.

వెంటనే ఆర్తెమాన్ కట్లూ గాయాలూ ఆకలీ లక్ష్య పెట్టకుండా నల్లని సుడిగాలిలా దూసుకు పోయింది. ఆ దూసుకుపోవడంలో మల్వీనానీ ప్యెరోనీ దారిలో బోర్లపడేసింది.

దాని పళ్లు టక్‌న కొట్టుకున్నాయి. యే పురుగో అడివి జంతువులా కుంయోమంది.

సద్దు మణిగింది. మల్వీనా గుండె మాత్రం అలారం గడియారంలా టిక్కు టిక్కు కొట్టు కుంటోంది.

కిందనుంచి వెలుతురు మెట్లమీద విరిసింది. డాడీ కార్లో చేత్తో పట్టుకున్న కొవ్వొత్తి వెలవెల బోయింది. నీరసంగా పసుపుపచ్చ వెలుతురు చిమ్మింది.

"కానీండి, కానీండి! గబగబ!" అని బురతీనొ గొంతు చించుకుంటూ అరిచేడు.

మల్వీనా వీపు వెనక్కి పెట్టి వొక్కొక్క మెట్టుమీదనుంచే కిందికి దిగుతోంది. ఆమె వెనక ప్యెరో కిందికి వురకడం మొదలుపెట్టాడు. ఆఖర్న ముందుకు వొంగుతూ కార్లో వచ్చేడు. అతని కొయ్య చెప్పులు తడవతడవకీ జారిపోతూ వున్నాయి.

మెట్లకింద ఆర్తెమాన్ రాళ్లు పరిచిన నేలమీద కూర్చుంది. అది నాలిక నాక్కుంటోంది. దాని కాళ్ల దగ్గర యెలక, షుషార అనే పేరు వున్నది, చచ్చిపడి వుంది.

బురతీనొ రెండు చేతులతోనూ చివికిపోయిన మందపాటి వూలు ముక్కని పట్టుకున్నాడు. అది రాతి గోడలో వో ఖాళీ జాగాని మూస్తూ వూగుతోంది. అక్కణ్ణుంచే నీలం వెలుతురు ప్రసరిస్తోంది.

వాళ్లు లోపలికి పాకి వెళ్లారు. అక్కడ మొదటగా వాళ్లకి కనిపించింది కప్పుమీద వున్న కిటికీలో నుంచి పడుతూ వున్న సూర్య కాంతి.

ఆ కాంతిలో గది అంతా వెలుగు పరుచుకుంది. ఆ కాంతి రేఖ బారుగా వుంది, దానిలో ధూళి రేణువులు నాట్యం చేస్తున్నాయి. ఆ గది అంతా పసుప్పచ్చ పాలరాతితో వుంది. మధ్యలో అద్భుత సౌందర్యంతో అలరారే కీలుబొమ్మల థియేటర్ వుంది. దానికి వున్న తెరలమీద బంగారు మెరుపు వుంది.

తెరలకి అటూ యిటూ రెండు నలుచదరపు శిఖరాలు వున్నాయి. యిటికలతో వాటిని కట్టినట్టుగా రంగులు వేసిన శిఖరాలు అవి. అవి యెత్తుగా వున్నాయి. ఆకుపచ్చ లోహంతో తయారయాయి. అవి ధగధగ మెరుస్తున్నాయి.

యెడం వేపు శిఖరంమీద గడియారం వుంది. దానికి కంచు ముల్లులు వున్నాయి. అంకెల దగ్గర ప్రతి దానిమీదా వో అమ్మాయీ అబ్బాయీ నవ్వుతున్నట్టుండే ముఖాల బొమ్మలు వున్నాయి.

కుడి వేపు శిఖరంమీద వో చిన్న గుండ్రటి కిటికీ, రంగు రంగుల పలకలతో వుంది.

ఆ కిటికీ పైన, ఆకుపచ్చ లోహం కప్పుమీద, మాట్లాడే కీచురాయి కూర్చుంది. వీళ్లంతా నోళ్లు వెళ్లబెట్టి ఆ అద్భుత థియేటర్‌ని చూస్తూ నుంచుండి పోయేరు.

"నీకు ముందే చెప్పానా బురతీనొ, ఘోరమైన ప్రమాదాలూ, దారుణ సాహసాలూ నీకు ముందే వున్నాయని" అని కీచురాయి మెల్లిగా, మాట మాటా పలుకుతూ అంది. "అంతా సుఖాంతం కావడం అదృష్టం. మరోలాగా జరిగి వుండేదే. సరే, సరే —"

కీచురాయి వృద్ధ కంఠంలో యేదో నిష్ఠూరం వున్నట్టు కనిపించింది. మరి మాట్లాడే యీ కీచురాయి తలమీద సుత్తి దెబ్బ పడిందిగా. వంద యేళ్ల వయసు పైబడినా, స్వతహాగా సాధు స్వభావం వున్నదైనా ఆ కీచురాయి దాన్ని మర్చిపోలేకపోయింది. అన్యాయంగా తగిలిన దెబ్బ కదా అది. అందుకని యిక పొడిగించి యేమీ చెప్పింది కాదు. యేదో దుమ్ము దులుపుకుంటున్నట్టుగా మీసాలు విదిలించుకుంది. యీ గొడవ గోలా తప్పించుకుని మెల్లిగా వో మూల కంతలోకి వెళ్లింది.

"వో గుట్ట బంగారమో, కనీసం వెండో కనిపిస్తాయేమోనని నేననుకున్నా. కాని యింతా చేసి దొరికింది పాత ఆట బొమ్మ!" అని డాడీ కార్లో కీచురాయి వెళ్లిపోయేక అన్నాడు.

శిఖరంమీద వున్న గడియారం దగ్గరికి వెళ్లి గోళ్లతో ముల్లులున్న పలకమీద తట్టేడు. గడియారం పక్కనే గడియారానికి కీ యిచ్చే చిన్న తాళం చెవి యిత్తడి కొక్కెంమీద వేలాడుతోంది. అతను దాన్ని తీసుకుని గడియారాన్ని తిప్పేడు.

గడియారం పెద్దగా టిక్‌టిక్‌మని తిరిగింది. గడియారం ముల్లులు తిరిగేయి. గంటల ముల్లు ఆరు చేరుకుంటోంది. పెద్ద ముల్లు దాదాపు పన్నెండు దగ్గర వుంది. గడియారం లోపల్నుంచి మూలు గూలూ, ముక్కుడాలూ వినిపించేయి. గడియారం శ్రావ్యంగా ఆరు గంటలు కొట్టింది.

గడియారం గంటలు కొడుతూ వుండగా కుడి వేపు శిఖరంమీద వున్న రంగు రంగుల కిటికీ అద్దాలు బార్లా తెరుచుకున్నాయి. బయటికి చిన్న రంగు రంగుల గడియారం పిట్ట వచ్చింది.

"రండి, రండి, రండి, రండి, రండి, రండి" అని ఆరు సార్లు పాడింది.

రెక్కలు అల్లల్లాడిస్తూ పాడింది.

పిట్ట మాయమైపోయింది. చిన్న కిటికీ ధనామని మూసుకుంది. యేదో డబడబ సంగీతం మొదలైంది. తెర లేచింది.

అక్కడ వున్న యెవళ్ళూ, డాడీ కార్లో కూడా, అంత అందమైన దృశ్యం చూసి యెరగడు.

వేదికమీద వో తోట కనిపించింది. చిన్న చిన్న చెట్లు వున్నాయి. వాటికి బంగారు ఆకులూ, వెండి ఆకులూ వున్నాయి. వాటిమీద మీ బొటనవేలి పరిమాణంలో వున్న స్టార్లింగ్ పిట్టలు పాడుతూ కూర్చున్నాయి. ఓ చెట్టు కొమ్మలమీద ఆపిల్ పళ్ళు వేలాడుతున్నాయి. వాటిలో వొక్కటి కూడా జొన్న గింజ కంటే పెద్దదిగా లేవు. చెట్లకింద నెమళ్ళు నాట్యం చేస్తున్నాయి. మునిగోళ్లమీద లేచి మెళ్ళు చాచి ఆపిల్ పళ్లని పొడుచుకు తినబోతున్నాయి. రెండు చిన్న మేకలు చిన్న గడ్డి బీట్లో చెంగుచెంగున గెంతుతూ వున్నాయి. మామూలు కంటికి కనిపించీ కనిపించని సీతాకోకచిలకలు గాలిలో యెగురుతున్నాయి.

అలా వో క్షణం సేపు జరిగింది. తర్వాత స్టార్లింగ్ పిట్టలు ఆగిపోయేయి. నెమళ్ళు, మేకలు తెరల వెనక్కి వెళ్లిపోయేయి. వేదికకింద వున్న రహస్య ద్వారాలగుండా చెట్లు కిందికి దిగి పోయేయి.

దూది పింజల్లాంటి మేఘాలు నేపథ్యంలో గోచరమయేయి. ఎర్రటి సూర్యుడు యిసిక యెడారి పైన ఉదయించేడు. రంగస్థలం పక్కల కుడినుంచి, యెడమనుంచి చెట్ల కొమ్మలు, లత కనిపించేయి. అవి పాముల్లా వున్నాయి. వో లతమీద నిజంగానే వో పాము వుంది. కొమ్మమీద వో కోతి కుటుంబం తోకలతో వేలాడుతోంది.

అది ఆఫ్రికా ఖండం. యిసిక యెడారిమీద అడివి జంతువులు వెళ్లాయి.

పెద్ద జూలు వున్న సింహం మూడు అంగల్లో గెంతిపోయింది. అది పిల్లి కంటే పెద్దగా లేక పోయినా భయంకరంగా కనిపించింది. చిన్న గొడుగు పట్టుకున్న వో ముచ్చటైన ఎలుగుబంటి దొర్లుకుంటూ పోతున్నట్టు కనిపించే నడకతో వెనక కాళ్లమీద నిలబడి నడుస్తూ వెళ్లింది.

వెలపరంగా వుండే మొసలి పక్కనుంచే పాకిపోయింది. క్రూరంగా చిన్నగా వుండే దాని కళ్ళు

దయగా కనిపించేటట్టు నటించాయి. అయినా ఆర్తెమాన్ దాన్ని నమ్మలేదు, దానికేసి గుర్రమంది.

ఓ రైనోసెరస్ ఉరుముతూ పోయింది. దాని కొమ్ముమీద భద్రత కోసం వో రబ్బరు బంతిని పెట్టారు. ఓ జిరాఫీ పక్కనుంచే పోయింది. అది చారలు వున్న వొంటెలాగా వుంది. సాధ్యమైనంత బారుగా మెడ చాచి పోయింది. తర్వాత పిల్లల నేస్తం ఏనుగు వచ్చింది. తెలివైన, దయా స్వభావం గల ఏనుగు. అది తొండం ఆడించింది. తొండంతో యేవో చాకొలెట్లు పట్టుకొంది.

ఆఖర్న అటూ యిటూ వూక్కుంటూ భయంకరంగా, అసహ్యంగా వుండే అడివి నక్క వచ్చి వెళ్లింది. ఆర్తెమాన్ మొరుగుతూ దానిమీదకి వురికింది. ఆర్తెమాన్ తోక పట్టుకుని వేదికమీదనుంచి డాడీ కార్లో దాన్ని లాగ గలిగేడంతే. అడివి జంతువులు వెళ్లిపోయేయి. ఒక్కసారిగా సూర్యుడు అస్తమించేడు. చీకట్లో యేవో కంటికి కనిపించని వస్తువులు పైనుంచి కిందికి దిగేయి. మిగిలినవి పక్కనుంచి బయటికి పోయేయి. బాణం తాడు లాగిన లాంటి చప్పుడు వినిపించింది.

వీధి దీపాలు వెలిగాయి. రంగదృశ్యం వో నగరం చౌకు. యిళ్ల తలుపులు తెరుచుకున్నాయి, చిన్నగా వున్న జనం బయటకి పరిగెత్తుతూ వచ్చేరు. వో ఆటబొమ్మ ట్రామ్‌బండి యెక్కారు. కండక్టరు గంట మోగించేడు: ట్రామ్ డ్రైవరు హేండిల్ తిప్పేడు. వో చిన్న పిల్లాడు లాఘవంగా కమ్మీ పట్టుకున్నాడు. పోలీసొకతను యీల వేశాడు. ట్రామ్ భవనాల మధ్య మలుపు తిరిగి వెళ్లిపోయింది.

యెవరో సైక్లిస్టు అటు వెళ్లేడు. అతని సైకిలు చక్రాలు లక్కపిడత మూతలంతేసి వున్నాయి. పేపర్ల కుర్రాడొకడు అటు వేపు పరిగెత్తి వెళ్లేడు. అతని దగ్గరున్న పేపర్లు టేబిల్ కేలెండరు షీటు చింపి నాలుగు మడతలు పెట్టినట్టుగా వున్నాయి.

ఐస్‌క్రీమ్ అమ్మే మనిషి వొకతను ఐస్‌క్రీమ్ బండిని చౌకు మధ్యగా తోసుకుంటూ వెళ్లేడు. బాల్కనీలమీదనుంచి చిన్న అమ్మాయిలు అతనికేసి చెయ్యి వూపేరు, దిగి పరిగెత్తివెళ్లేరు. కాని ఐస్‌క్రీమ్ అమ్మేవాడు అయిపోయేయన్నట్టు చెయ్యి వూపేడు.

"ఐస్‌క్రీమ్ అయిపోయింది. మళ్లీ సారి" అన్నాడు.

అప్పుడు తెర వాలింది. మళ్లీ తెరమీద బంగారు మెరుపు దానిమీద ప్రసరించింది.

డాడీ కార్లో, మల్వీనా, ప్యెరో సంతోషంతో పరవశించిపోయేరు. కాని బురతీనొ చేతులు జేబుల్లో పెట్టుకుని, ముక్కు పైకి పెట్టి వుండి పోయేడు.

"చూశారా! నేను తర్చిల తాబేలు అత్త చెరువులో దూరి నానడం వృధా పోలేదు. మనం యీ థియేటర్ ప్రదర్శన యేర్పాటు చేద్దాం. దీన్ని యేమందామో తెలుసా? 'బంగారు తాళం లేదా బురతీనొవీ, అతని మిత్రులవీ అద్భుత సాహస కృత్యాలు.' కరబాస్ బరబాస్ కుళ్లికుళ్లి చస్తాడు" అన్నాడు.

ప్యెరో ముడుచుకుంటున్న తన నుదుటిమీద పిడికిళ్లతో రుద్దుకున్నాడు.

“నేను రమ్యమైన పద్యాలు రాస్తాను” అన్నాడు.

“నేను టిక్కెట్లు, ఐస్‌క్రీమ్ అమ్ముతా. నాలో ప్రతిభ కనిపిస్తే చిన్న అమ్మాయిల పాత్రలు వేస్తా” అంది మల్వీనా.

“అంత తొందరవద్దు పిల్లలూ” అన్నాడు డాడీ కార్లో. “మీ చదువులు యెప్పుడు చదువు తారు?” అన్నాడు.

“పొద్దున్న చదువు, సాయంత్రం థియేటరు” అని అందరూ వొక్కసారే అన్నారు.

“బాగుంది. నేను నా వాయిద్యం వాయిస్తాను. మనం ఇటలీలో వూరూరూ తిరుగుదాం. నేను బండి తోలతాను, వెల్లుల్లి వేసి మాంసం వంటకం వండుతా” అన్నాడు డాడీ కార్లో.

“ఆర్తెమాన్ స్టేజీ యేర్పాట్లు, దుస్తులు చూస్తుంది. మనం బట్టల బీరువా తాళం తనకి యిద్దాం. ప్రదర్శన జరిగేటప్పుడు తెర వెనకనుంచి సింహ గర్జని అనుకరిస్తుంది. రైనోలాగా ధనధన చప్పుడు చేస్తుంది. మొసలిలాగా పళ్ళు కొరుకుతుంది. హోరు గాలి వీచినట్టు అనిపింప చేస్తుంది — తోకని సర్రన వూపి. యింకా మనకి అవసరం అయిన యితర చప్పుళ్ళు చేస్తుంది” అన్నాడు బురతీనొ.

“మరి నువ్వేం చేస్తావు బురతీనొ?” అని అందరూ అడిగేరు. “మరి నువ్వేం చేస్తావు? థియేటర్‌లో నీ పని యేమిటి?” అన్నారు.

“అయ్యో తెలివాని! నేను నా పాత్ర వేస్తాను, ప్రపంచమంతా పేరు గడిస్తాను” అన్నాడు బురతీనొ.



# కొత్త కీలుబొమ్మల థియేటరులో తొలి ప్రదర్శన

కరబాస్ బరబాస్ నెగడు ముందు చిరాకుగా కూచున్నాడు. కట్టెలు చెమ్మగా వుండడంతో సరిగా మండడం లేదు. బయట వాన కుండపోతగా కురుస్తోంది. కీలుబొమ్మల థియేటరు కప్పంతా చిల్లులూ, కంతలూనూ, వాటిలోనుంచి వాన లోపలకి కురుస్తోంది. కీలుబొమ్మల కాళ్ళూ చేతులూ చెమ్మగిల్లి పోయాయి. యెవళ్ళకీ రిహార్సల్సు చెయ్య బుద్ధి పుట్టడం లేదు. యేడు పేటల కమ్చీతో బెదిరించినా కూడా కదల బుద్ధి పుట్టడం లేదు ఆ బొమ్మలకి. మూఢోజులుగా కీలుబొమ్మలకి ముద్ద లేదు.

టౌన్‌హాల్ శిఖరం పైన వున్న గడియారం ఆరు గంటలు కొట్టింది. కరబాస్ బరబాస్ ముఖం ముడుచుకుని ఆడిటోరియంలోకి వెళ్ళేడు. అది ఖాళీగా వుంది.

"'ఘనమైన ప్రేక్షకుల్ని' తగలెయ్య!" అని గొణుక్కున్నాడు. రోడ్డుమీదకి వెళ్ళేడు. బయటికి వెడుతూనే చుట్టూతా చూశేడు. కళ్ళు మిటకరించేడు. సునాయాసంగా వో కాకి లోపలికి దూరి పోగలిగినంత వెడల్పుగా నోరు తెరిచేడు.

అతని థియేటర్‌కి యెదురుగ్గా, చెమ్మ సముద్రం గాలి వీస్తూ వున్నా గానీ వో గుంపు కొత్త పెద్ద గుడారం ముందు పోగయి వుంది. సింహద్వారం పైన బాల్కనీమీద పొడుగాటి ముక్కుతో, కోసు టోపీ పెట్టుకున్న కొయ్య బొమ్మ వుంది. ఆ బొమ్మ బూరా వూత్తోంది. యేదో అరుస్తోంది.

జనం నవ్వుతున్నారు. చప్పట్లు కొడుతున్నారు. కొంతమంది లోపలికి వెళ్ళేరు.

కరబాస్ బరబాస్ అక్కడ నుంచుని వుండగా జలగల వైద్యుడు వచ్చేడు. యెన్నడు లేనంత బురద వాసన కొడుతున్నాడు.

"అబ్బ! రాత!" అని ముఖం అంతా ముడతలు పడేటట్టు చేసుకుని అన్నాడతను. "యీ జలగల వైద్యం యేం లాభం లేదు. నేను వాళ్ళ దగ్గరికి వెళ్ళాల్సి వస్తోంది" అని కొత్త గుడారంకేసి చూపిస్తూ అన్నాడు. "దీపాలు పెట్టే ఉద్యోగమో, నేల వూడ్చే ఉద్యోగమో యిమ్మని అడుగుతా" అన్నాడు.

"యీ థియేటరు యెవరిది? యెక్కణ్ణుంచి వూడి పడింది యిది?" అని కరబాస్ బరబాస్ బుస కొట్టేడు.

"యిది కీలుబొమ్మల సొంతం. అని తమ సొంత థియేటరు తెరుచుకున్నాయి. 'మెరుపు థియేటరు.' తమ పాటలు తామే రాసుకుని తామే నటించుకుంటున్నాయి."

కరబాస్ బరబాస్ పళ్ళు పటపట కొరికేడు. గడ్డం పీక్కున్నాడు. గుడారం దగ్గరికి విసవిస వెళ్ళేడు.

"మొదటి ప్రదర్శన! కీలుబొమ్మల జీవితంలో జరిగిన ఆసక్తికరమైన ఆశ్చర్యజనకమైన సంఘటనల ప్రదర్శన! రండి! చూడండి" అని బురతీనొ అరుస్తున్నాడు. "మా శత్రువుల్ని యెలా మా


కీలుబొమ్మల ఆట
మెరుపు థియేటరు
బుకింగ్

తెలివితేటలతో వోడించి సాహసంగా, సమయస్ఫూర్తితో నెగ్గు కొచ్చామో తెలిపే వాస్తవంగా జరిగిన కథ'' అంటున్నాడు.

కీలుబొమ్మ థియేటరు గుమ్మంలో, చిన్న అద్దాల పెట్టె వెనక మల్వీనా నుంచుంది. నీలం జుట్టుకి అందమైన రిబ్బను చుట్టుకుంది. ఆమె గబగబ టిక్కెట్లు అమ్మలేకపోతోంది. కీలు బొమ్మల జీవితం గురించి తెలుసుకుందామన్న కుతూహలంతో చాలా మంది జనం వచ్చేరు.

డాడీ కార్లో కొత్త మఖమల్ చొక్కా తొడుక్కుని తన సంగీత వాయిద్యం వాయిస్తున్నాడు. ఘన మైన ప్రేక్షకుల్ని చూసి హుషారుగా కన్ను గీటుతున్నాడు.

ఆర్తెమాన్ గుడారంలోనుంచి అలిసి నక్కని తోక పట్టుకు లాగుతోంది. ఆ నక్క టికెట్ లేకుండా లోపలికి దూరేసింది.

పిల్లి బాసిలో కూడా టికెట్ లేకుండా లోపలికి దూరేసింది. అది యెలాగో బయట పడి ఆ వానలో యెత్తుగా వున్న చెట్టు చివరకంటా యెక్కేసి దిగాలుగా చూస్తోంది.

బురతీనొ బగ్గలు పూరించి బూరా వూదేడు.

''ప్రదర్శన మొదలవుతోంది.''

మొదటి రంగంలో పాల్గొందుకు గాను చిన్న నిచ్చెనమీదనుంచి కిందికి దిగి వచ్చేడు. మొదటి రంగంలో డాడీ కార్లో దుంగని కోసి చిన్న బొమ్మని చెక్కుతాడు. ఆ బొమ్మవల్ల తనకి ఆనందం ప్రాప్తిస్తుంది అనే వూహే అతనికి లేదు అప్పటికి.

థియేటర్లోకి ఆఖర్న వెళ్లింది తర్చిల తాబేలు. అది ఉచితంగా అభినందనలతో యిచ్చిన టికెట్ని నోటితో పట్టుకుంది. మేలైన కాగితం బంగారు నగిషీలతో అచ్చయి వుంది ఆ టికెట్.

ప్రదర్శన మొదలైంది. కరబాస్ బరబాస్ యేడుపు మొహం వేసుకుని తన ఖాళీ థియేటర్కి వెనక్కి తిరిగివచ్చేడు. యేదు పేటల కమ్చీ తీసి కొట్టు గది తెరిచేడు.

''మీకు బద్ధకంగా వుండడం అంటే యేమిటో నేర్పుతా గజ్జి తొత్తుల్లారా!'' అని ఉగ్రంగా అరిచేడు. ''జనాన్ని యిక్కడికి మీరు ఆకర్షించేటట్టు మీచేత చేయిస్తాను'' అన్నాడు.

కమ్చీ సర్రన దూశేడు. కాని యెక్కడా ఉలుకూ పలుకూ లేదు. కొట్టు గది కాళీగా వుంది. కొక్కేలమీద చిన్న తాటి ముక్కలు వేలాడుతున్నాయంతే.

కీలుబొమ్మలన్నీ — హార్లెక్విన్, నల్ల ముసుగుల అమ్మాయిలు, నక్షత్రాలతో వున్న కోసు టోపీలు పెట్టుకున్న మంత్రగాళ్లు, దోసకాయ ముక్కులు వున్న గూనివాళ్లు, నల్లని నీగ్రోలు, చిన్న కుక్కలు — అన్నీ, అన్నీ, అన్నీ బొమ్మలూ కరబాస్ బరబాస్ దగ్గర్నుంచి పారిపోయేయి.

భీకరంగా గర్జిస్తూ అతను థియేటర్లోనుంచి బయటకి రోడ్డుమీదకి పోయేడు. సరిగ్గా ఆ

సమయంలో తన బృందంలోని ఆఖరి కీలుబొమ్మ వో చెరువుమీదనుంచి గెంతుకుంటూ గెంతుకుంటూ కొత్త థియేటర్‌లోకి పోతోంది. కొత్త థియేటర్‌లో బాజా భజంత్రీలు సంతోషంగా మోగుతున్నాయి. అక్కడినుంచి నవ్వులు చప్పట్లు వినిపిస్తున్నాయి.

కరబాస్ బరబాస్ చేతికి చిక్కింది అల్లా చిన్న కుక్క పిల్ల బొమ్మ. ముదురు రంగు ముతక గుడ్డతో చేసిన బొమ్మ అది. దానికి రెండు బొత్తాలని కళ్ళగా పెట్టేరు. కాని యెక్కడినుంచి వూడి పడిందో ఆర్తెమాన్ అతనిమీదకి ఉరుకుతూ వచ్చింది, కింద పడేసింది. అతని చేతిలోనుంచి ఆ చిన్న కుక్కని లాక్కుంది. గుడారంలోకి దూసుకుపోయింది. గుడారంలో రంగ దృశ్యాల వెనక వేడివేడి మాంసం వెల్లుల్లి పాయలు వేసి వండుతున్నారు. అది ఆకలిగా వున్న నటుల కోసం.

కరబాస్ బరబాస్ యెక్కడ పడ్డ వాడక్కడే వుండిపోయేడు. వానలో, నీటికుంటలో కూర్చుండి పోయేడు.



# విషయసూచిక

పాఠకులకు మనవి

ఈ పుస్తకం గురించీ, దీని అనువాదం గురించీ మీ అభిప్రాయాల్లను "రాదుగ" ప్రచురణాలయానికి దయచేసి తెలుపండి.

మీ అభిప్రాయాలను ఈక్రింది చిరునామాకు పంపండి:

"Raduga" Publishers
17, Zubovsky Boulevard
Moscow, 119859 USSR

